# ప్రేమకు పెళ్ళెప్పుడు?

ముద్దబ్బాయి కథ



## రేగులపాటి కిషన్‌రావు



విజయలక్ష్మి పబ్లికేషన్స్
చింతల్‌ఠాణం - రంరవంఢి.

విజయలక్ష్మి పబ్లికేషన్స్ ప్రచురణ నెం. 5

ప్రేమకు పెళ్ళెప్పుడు? మొద్దబ్బాయి కథ

మొదటి ముద్రణ: జూన్ 1982

వెల: రు. 6-00

ముద్రణ: విష్ణు ప్రింటింగ్ ప్రెస్
సిరిసిల్ల-505301

**ప్రతులకు:**

1. ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్
రాష్ట్రపతి రోడ్, సికింద్రాబాదు—3

2. అరుణా పబ్లిషింగ్ హౌస్
ఏలూరు రోడ్, విజయవాడ—2

3. విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌజ్
చంద్రం బిల్డింగ్స్, విజయవాడ—4

4. న్యూ స్టూడెంట్సు బుక్ సెంటర్
ఏలూరు రోడ్, విజయవాడ—2

5. నవోదయా పబ్లిషర్స్
ఏలూరు రోడ్, విజయవాడ—2



కవితా!

నీ బ్రతుకంతా

పండుగలా వుండాలనీ

నీ మనసెప్పుడూ

పండు వెన్నెలలా వుండాలనీ

పండువలె పండువరకు

పసిడి పంటలా

నీ బ్రతుకు వుండాలనీ

ఆశిస్తూ ఆశీర్వదిస్తూ

నా ఈ కృతిని నా ఈ కృషిని

అంకితమిస్తున్నాను నీకు

— నాన్న

# రేగులపాటి కిషన్‌రావు రచనలు

1. ప్రేమకు పెళ్ళెప్పుడు? మొద్దబ్బాయి కథ 6—00

♦ ♦ ♦

2. సంఘర్షణ 9—00

ప్రతులకు

**అరుణా పబ్లిషింగ్ హౌజ్, విజయవాడ-2**

♦ ♦ ♦

3. భాగవత విషసర్పం 15—00

4. పతివ్రత ఎవరు? వాణిశ్రీ 7—00

5. ఆమె వితంతువు కాదు 4—00

దొరుకే చోటు

**న్యూ స్టూడెంట్స్ బుక్ సెంటర్, విజయవాడ-2**

# ప్రేమకు పెళ్ళెప్పుడు?

సాయంత్రం మూడు గంటలు కావస్తోంది.

ఎవరో కొత్త వ్యక్తి మెల్లగా నడచివస్తున్నాడు. వీధి అరుగు మీద కూర్చున్న ప్రభాకర్‌రావు అతనిని చాలా శ్రద్ధతో చూడ సాగాడు. అతడు ధరించిన దుస్తులు బీదరికాన్ని తెలియజేస్తున్నాయి. నడచి నడచి అలసిపోయినట్టు అతని నడక తెలియజేస్తూవుంది. అతని ముఖం అందమైనదే అయినా చెమట పట్టి వుండడం వలన అందంగా కనిపించుటలేదు.

కోమటి కొమురయ్య ఇంటి దక్షిణ భాగాన వేపచెట్టువుంది. అతడు ఆ చెట్టు నీడవైపే నడుస్తున్నాడు. మరో పదడుగులు నడిస్తే చెట్టు నీడకు చేరేవాడు. కాని హఠాత్తుగా నేలమీద పడిపోయాడు.

ప్రభాకర్‌రావు గబగబా అడుగులు వేస్తూ అతని చెంతకు చేరాడు. అతడు స్పృహతప్పి పడిపోయాడని గ్రహించి కోమటి కొమురయ్య ఇంట్లోకివెళ్ళి గ్లాసుతో నీళ్ళుతెచ్చి అతని ముఖముపై చల్లాడు..

అప్పటికే కొంతమంది అతని వద్దకు వచ్చి చేరారు.

"ఏమయింది?" ముఖంపై నీళ్ళు చల్లుతున్న ప్రభాకర్ రావును అడిగాడొకతను.

"నడుస్తూ నడుస్తూనే పడిపోయాడు. వడదెబ్బతగిలినట్టుంది"

" ఎవరతను?" మరొక వ్యక్తి ప్రశ్నించాడు ప్రభాకర్ రావును.

" ఏమో! నాకూ తెలియదు" అని ఓ క్షణమాగి మళ్లీ అతడే అన్నాడు. " పాపం ఎక్కడివాడో ఏమిటో అలా వేపచెట్టు నీడ లోకి తీసుక వెళ్దాం పట్టండి"

నలుగురయిదుగురు అతనిని లేవనెత్తి వేపచెట్టు నీడలోకి తెచ్చి పరుండబెట్టారు.

ఈ సంవత్సరం వున్న ఎండలను గురించి, ఎండలవల్ల కలిగే కష్టనష్టాలను గురించి వేసవిలో నీటి కొరతవల్ల కొందరు మనుషులు పశు పక్ష్యాదులు పడే ఇబ్బందుల గురించి కొందరు మాట్లాడుకోసాగారు. కొందరు శ్రోతలుగా వుండిపోయారు.

పదిపదిహేను నిమిషాల తర్వాత అతనికి మెలకువవచ్చింది.

ప్రభాకర్ రావు అతని ముఖంలోకి చూస్తూ అన్నాడు. " ఏమయ్యా!" ఏమయింది? అలా పడిపోయావు?

" నిన్న ఉదయం నుండి అన్నం తినలేదు.. పుణ్యాత్ములెవ రయినా కొంచెం అన్నం పెట్టి నా ప్రాణాలను రక్షించండి" అక్కడ గుమిగూడిన వారి ముఖాలలోకి చూస్తూ దీనంగా అన్నాడు.

చాలా మంది అతని మాటలను లక్ష్యపెట్టకుండా మెల్ల మెల్లగా వెళ్లిపోయారు. ప్రభాకర్ రావు జాలి నిండిన కళ్లతో అతని వైపు చూస్తూ అన్నాడు. "రా! మా యింటికి వెళ్దాం"

ఇద్దరూ ఇంటికి చేరారు.

" అమ్మా! ఈయనకు కొంచెం అన్నం పెట్టవే. చాలా ఆకలితో వున్నాడు. నిన్నటి నుండి అన్నం తినలేదట" ప్రభాకర్

రావు తల్లితో అన్నాడు.

మంచములో కూర్చుండి స్వెట్టర్ అల్లుతున్న మణిమాల అతనివైపు ఆసక్తిగా చూస్తూ అంది "నీపేరేమిటి బాబూ!"

"ప్రకాశం" చెప్పాడతడు.

మణిమాల క్షణమాలోచించి అల్లుతున్న స్వెట్టర్ టేబుల్‌పై పెట్టి వంటింట్లోకి వెళ్లింది. రెండు నిమిషాల తర్వాత అరటాకులో అన్నము, ఆవ్యపుకాయ కూర పెట్టుకొని ప్రకాశం దగ్గరకు వచ్చింది.

అరటాకులో వున్న అన్నమును. ఆవ్యపుకాయ కూరను చూచి చాలా ఆనందించాడు ప్రకాశం.

ప్రభాకర్‌రావు వంటింట్లోకి వెళ్ళి గ్లాసుతో నీళ్ళు తెచ్చి అతని ముందు పెట్టాడు.

ప్రకాశం ఆపురాపురు మన్నట్టు అన్నం తినేశాడు. అర టాకు పెంటపై పడేసి బావివద్ద చేయి కడుక్కొని మళ్ళీ వరండా లోకి వచ్చి గాసు గోడవగ్గర బోర్లించి ప్రభాకర్‌రావు వైపు చూస్తూ అన్నాడు "మీ మేలు జన్మలో మరిచిపోలేను.....ఇక వెళ్తానండి"

"వెళ్ళుదువుగానిలే! విశ్రాంతి తీసుకో నిన్నటి నుండి భోజనము చెయ్యక పోవడానికి కారణం చెప్పావుకాదు. అలా మంచములో కూర్చుండి నీ కథేమిటో చెప్పు" అన్నాడు ప్రభాకర్ రావు.

ప్రకాశం గోడ దగ్గర ఉన్న ఉలువల బస్తామీద కూర్చుండి చెప్పసాగాడు.

మా ఊరుపేరు లింగంపేట చాలా చిన్నగ్రామం. మా

వూరికి తూర్పుదిశలో మదిర అనే గ్రామం వుంది. మా ఊరి పొలాలు మదిర పొలాలు ఒకే కాలువతో పారుతూ వుంటాయి.

మూడు సంవత్సరాల క్రితం వర్షాలు తక్కువగా వున్నందున మానేరు ప్రాజెక్టు పూర్తిగా నిండలేదు మావూరి కొరకు కేటాయించిన నీటిని రాత్రివేళ మదిర వాళ్లు కట్టను తెంపి తీసుకె వెళ్ళేవారు. మదిర వాళ్ళు కట్టను తెంపడం, మావూరివాళ్ళు కట్టి పోయడం ఇలా రెండుమూడు సార్లు జరిగింది.

మావూరి రైతులకు కోపం వొచ్చింది. కట్టి తెంపేవారిని పట్టు కోవడానికి కొందరు రైతులు, కొందరు పెద్దరైతుల పాలేర్లు రాత్రి వేళ బయలుదేరారు. మాతండ్రి ఒక ధనికుని వ్యవసాయం చేయిస్తుండేవాడు.

అలా వెళ్ళినవాళ్ళు ఒక చోట ఆగి దాగి చూడసాగారు.

మదిర వాళ్ళు కట్టి తెంపడానికి వచ్చారు. ఆ కట్టి తెంపితే నీరంతా మదిర పొలాల వైపు పరుగెత్తుతుంది. మావూరివాళ్ళ అడ్డగించారు. వాళ్ళు వూర్కోలేదు. క తెంపడానికే పూనుకు న్నారు. అప్పుడు మావూరివాళ్ళ సంఖ్య ఎక్కువగా వుండడంవల్ల మదిర వాళ్ళను కొట్టిగలిగారు.

మదిర వాళ్ళు అమీనుకు లంచం ఇచ్చి తమ వైపు తిప్పు కున్నారని మావూరి వాళ్ళకు తెలిసింది. అయినా మావూరి వాళ్ళు భయపడకుండా అడ్డు కట్టను తెంపకుండా చూడడానికి చాలా మంది వెళ్ళారు. మదిర వాళ్ళు కట్టి తెంపుతుండగా మావూరి వాళ్ళు అడ్డ గించారట. పోలీసులు, అమీను మదిర వాళ్ళ పక్షం చేరి మావూరి వాళ్లను బెదిరించారట. శాంతి భద్రతలను కాపాడే పోలీసుశాఖ

లో ఇలాంటి అవినీతి పరులుండడం విచారకరం. వాళ్లు పోలీసు వాళ్ళ బెదిరింపులను కూడా లెక్కచేయకుండా కట్ట తెంపే వాళ్ళతో ఘర్షణకు దిగారట.

అమీను గాలిలోకి పిస్తోలు పేల్చాడట. అయినా మా వూరి వాళ్లు పారిపోలేదు. ఆవూరి వాళ్లకు మావూరి వాళ్ళకు పోట్లాట ప్రారంభమైంది. అమీను పిస్తోలు పేల్చాడట. ఆ దెబ్బతో ఒక రైతు నేలకొరిగాడట. అప్పుడు హఠాత్తుగా అమీనును చుట్టుముట్టి కొట్టారట. పోలీసులు పరుగెత్తారట. మా వూరివాళ్లు అమీనును రాళ్లతో కొడుతుండగా మా గ్రామ సర్పంచ్ వద్దని వారించాడట. లేనియెడల ఆ రోజు అమీను చనిపోయివుండేవాడట.

మరుచటి రోజు మా గ్రామానికి రిజర్వు పోలీసుదళం వచ్చింది. చాలామంది మగవాళ్లు ఎక్కడెక్కడికో పారిపోయారు. పోలీసుల చేతుల్లో చిక్కినవాళ్లు చావుదెబ్బలు తిన్నారు. పోలీసువాళ్లు ఇండ్లల్లో చొరబడి ఆడవాళ్ళను కూడా కొట్టారట. అందమైన ఆడ వాళ్ళను చెడగొట్టారట కూడా. ఈ విషయాలన్ని వార్తా పత్రికల్లోకి ఎక్కాయి.

మా తల్లిని ఒక పోలీసు బలాత్కరించబోగా ఆమె తప్పించుకొని పారిపోయి బావిలో దూకి చనిపోయింది.

ఇక మానాన్న చనిపోవడానికి మరోకారణం వుంది.

మా నాన్న యజమాని ఒకనాడు తప్పతాగి వున్నాడు. ఆనాడు నౌకరు ఏదో చిన్నపొరపాటు చేశాడు. యజమాని తిట్టాడు. నౌకరు ఎదురు తిరిగి మాటాడాడు. యజమాని కోపంతో నౌకరు వైపు రాయి విసిరాడు. చంపాలన్న ఉద్దేశముతో అతడారాయి

వినరకపోయినా ఆ దెబ్బతో నౌకరు చనిపోయాడు. లౌక్యం తెలి యని అమాకుడు మానాన్న కోర్టులో నిజం చెప్పేశాడు. కాని అతడు డబ్బు వెదజల్లి కేసును తలక్రిందులు చేయించి తనకు పడ బోయే శిక్షనుండి తప్పించుకున్నాడు.

మానాన్న మీద పగబూని వున్న అతడు యుక్తిగా రహ స్యంగా చంపించాడు. నన్ను చంపించడానికి ప్రయత్నిస్తున్నట్లు తెలిసింది. నేను గోదావరిఖనికి వెళ్ళిపోయాను. అక్కడ మా దూరపు బంధువు ఒకతను బొగ్గుగనిలో పనిచేస్తున్నాడు. నేను అతని ఇంట్లో వుండి ఉద్యోగ ప్రయత్నం చేయసాగాను......

ప్రకాశ్ ఇంకా ఏదో చెప్పబోయి ఆగిపోయాడు.

" ఆ తర్వాత......'' అంది మణిమాల ఒక విషయాన్ని లోతుగా అడిగి తెలుసుకోవడం ఆమెకు అలవాటే.

"వాళ్ల ఇంట్లో ఒక సంఘటన జరిగింది. చెప్తే మీరేమైనా అనుకుంటారేమోనని ఆగాను''

"ఏమీ అనుకోము చెప్పు'' అని ప్రభాకర్‌రావు అనడంతో ప్రకాశ్ మళ్లీ చెప్పసాగాడు.

"ఆ మా దూరపు బంధువు పేరు కిష్టయ్య. అతడు మొదటి భార్య చనిపోవడం వల్ల రెండవ పెళ్లి చేసుకున్నాడు. అతని వయస్సు నలభై పైన. ఆ రెండవ భార్య వయస్సు పందొమ్మిది వుండవచ్చు. కిష్టయ్యకు నల్లమందు తినే అలవాటు వుండేది. అతడు ప్రతిరోజు రాత్రి నల్లమందు మ్రింగి మరీ పడుకునేవాడు.

ఓరోజు రాత్రి చీకట్లో ఆమె నా దగ్గరకు వచ్చింది. తన కోరిక తీర్చుమని బలాత్కారించింది.

మా తల్లిని బలాత్కరించిన పోలీసువాని మీద నాకెంత కోపం వచ్చిందో నన్ను బలాత్కరించిన యువతిమీద నాకంత కోపం వచ్చింది. ఆ తర్వాత చెప్పేదేముంది. అదే రాత్రి ఇల్లు వదలి బయటకు వచ్చేశాను.''

"నువ్వు ఎంతవరకు చదివావు బాబూ!'' మణిమాల అడిగింది.

"బి.యస్.సి. ఫైనల్ చదువుతుండగా నాన్న చనిపోవడం వల్ల అంతటితో నా చదువు ఆగిపోయింది'' చెప్పడం ఆపి కొన్ని క్షణాలు మౌనం వహించి ప్రభాకర్‌రావు వైపు మణిమాల వైపు కృతజ్ఞతాభావంతో చూస్తూ అన్నాడు'' ఇక వెళ్తానండి''

ప్రభాకర్‌రావు జేబులో నుండి అయిదు రూపాయల నోటు తీసి ''ఇదిగో ఈ డబ్బు దగ్గర వుంచుకో'' అంటూ అందివ్వబోయాడు.

ఏదో ఆలోచిస్తున్న మణిమాల ప్రభాకర్‌రావు వైపు తిరిగి "అదేమిటి బాబూ! ప్రకాశం ఇకముందు మన ఇంట్లోనే వుంటాడు. అతనికి చేతనైన పని చేస్తుంటాడు'' అంది.

ప్రకాశం ముఖం ఇష్టాన్ని ప్రకటిస్తున్నట్టు వికసించడం మణిమాల దృష్టిని దాటిపోలేదు.

ప్రకాశ్ మణిమాలకు నమస్కరించి అన్నాడు "ఏ ఆధారం లేని నాకు ఆధారం చూపిస్తున్న మీకు కృతజ్ఞతలు తెలుపుతున్నాను. మీరేపని చెప్పినా మీకు సంతృప్తి కలిగించే విధంగా చేయడానికి ప్రయత్నిస్తాను.'' అన్నాడు.

"కొంచెం సేపు పడుకొని విశ్రాంతి తీసుకో'' అని చెప్పి

ప్రభాకర్‌రావు వీధిలోకి వెళ్ళిపోయాడు.

నాలుగు రోజుల అనంతరం—

వరండాలో తడక చాటున పడుకొన్న ప్రకాశ్‌కు అమ్మాయిల మాటలు, నవ్వులు వినిపించాయి. అతడు లేచి కూర్చున్నాడు. ముగ్గురమ్మాయిలు మంచములో ప్రక్కప్రక్కన కూర్చుండి వున్నారు. మధ్యనున్న అమ్మాయి చేతిలో ఏదో సినీమా పత్రిక వుంది. ఆ పత్రికలో ఏముందో కాని ముగ్గురూ కుతూహలంగా చూస్తున్నారు.

ప్రకాశ్ వాళ్ళవైపు ఆసక్తిగా చూడసాగాడు. పదిహేను, పదహారు సంవత్సరాల అమ్మాయిలు వాళ్ళు. అందంగా ఆరోగ్యంగా వున్నారు.

పత్రిక తిరిగేస్తున్న శోభారాణి కుడివైపు పేజీలో వున్న అర్ధనగ్న స్త్రీని చూస్తూ అంది "రాను రాను ఈ సినీమా వ్యాపారులు ఆడవాళ్లను నగ్నంగా నిలబెట్టి సినీమాలు తీసేట్టు వున్నారు"

"అలాగనుక సినీమాలు తీస్తే మగవాళ్ళ విషయం ఏమోగానీ ఆడవాళ్ళు మాత్రం ఎవ్వరూ చూడరు" అంది నీలిమ ముఖం చిట్లిస్తూ.

"అని ఎలా అనగలుగుతున్నావు? ఇప్పుడు వస్తున్న అర్ధనగ్న చిత్రాలను ఆడవాళ్ళు చూడడం లేదా?" ప్రేమ ప్రశ్నించింది. ఆమె పేరు ప్రేమలత. కాని అందరూ ఆమెను 'ప్రేమ' అనే పిలుస్తారు.

"నేనైతే అలాంటి సినీమా ఒక్కటీ చూడలేదు"

"నేను చాలా చూశాను"

" పోనీ నువ్వు ఒక మగవానిముందు అర్ధనగ్నంగా నిలబడ గలవా?" ఎదురు ప్రశ్న వేసింది నీలిమ.

"అర్ధనగ్న చిత్రాలు చూచే ఆడవాళ్ళంతా అర్ధనగ్నంగా ఒక మగవాని ముందు నిలబడాలంటావా?"

నీలిమ మాట్లాడలేదు.

శోభారాణి అంది "పరాయి మగవాళ్ళముందు అర్ధనగ్నంగా నిలబడే స్త్రీలు నిజంగా సిగ్గులేని వాళ్ళే"

" పరాయి మగవాళ్ళేమిటి?......" నీలిమ అర్థం కానట్టు ముఖంపెట్టి శోభారాణివైపు చూచింది.

"నాభర్త దగ్గర నేను అర్ధనగ్నంగానేకాదు నగ్నంగానైనా వుండగలను. పెళ్ళైతే అలాంటి అనుభవం మీకూ దొరుకుతుంది" శోభారాణికి నాలుగు నెలల క్రితం వివాహమైంది.

నీలిమ, ప్రేమ ఒకరి ముఖాలొకరు చూచుకుంటూ నవ్వసాగారు.

శోభారాణి నీలిమ వీపులో తట్టుతూ అంది " అటుచూడు"

నీలిమ, ప్రేమ శోభారాణి సైగచేసి చూపించిన వైపు చూశారు. వారికి ప్రకాశ్ కనిపించాడు.

ప్రేమ కాస్త కోపంతో అడిగింది "ఎవరు నువ్వు?"

" దొంగను మాత్రం కాదు" అన్నాడు ప్రకాశ్.

" దొరలా మాత్రం లేవు " అంది ప్రేమ.

ప్రకాశ్ నవ్వాడు.

"నవ్వడంకాదు మేము మాట్లాడుకునే మాటలను రహస్యంగా వింటున్న నువ్వు సిగ్గుపడాలి. వెళ్లు బయటకు"

ప్రకాశ్ నిటారుగా నిలబడి అన్నాడు. "వెళ్ళకపోతే"

"వెళ్ళకపోతేనా.......ఊఁ వెళ్ళకపోతే నీచెంపకు నా చేతి రుచి చూపిస్తా"

"మీ ఇంటికి వచ్చిన అతిథికి మీరుచేసే సత్కారమాఅది"

"మీరు...మీరెవరో నాకు తెలియదు "ప్రేమ కంగారు పడింది.

అంతవరకు ఊపిరి బిగబట్టి చూస్తున్న శోభారాణి, నీలిమ ఫక్కున నవ్వారు.

ప్రేమ అటువైపు చూచింది. వాళ్ళువెళ్ళిపోతూ కనిపించారు "మీరెందుకే వెళ్ళిపోతున్నారు" అందామె.

"మళ్ళీ రేపు కలుసుకుందాం" అంది నీలిమ.

ప్రేమ కొంచెంసేపు మౌనంగా నిలబడి ఏదో మాట్లాడబోయి ఆగిపోయింది.

"మీరెవరో తెలుసుకోవచ్చా?" ప్రశ్నించాడు ప్రకాశ్.

"నేను మానాన్న కూతురను"

"ప్రకాశ్ నవ్వి అన్నాడు" అలాచెప్తే మీరెవరో నాకెలా తెలుస్తుంది. మీనాన్నపేరు చెప్పండి"

"గోపాలరావు గారు' ప్రేమ క్షణమాగి అంది "మీరెవరో నాకసలే తెలియదు"

"మీసేవకుణ్ని" కొంటెగా చూస్తూ అన్నాడు ప్రకాశ్.

"ఇంతకు ముందు అతిథి నన్నారుగా"

"అతిథిగా వచ్చి సేవకునిగా మారినవాణ్ని"

"అంటే?"

ప్రకాశ్ అంతా చెప్పేశాడు. చివరికి అన్నాడు "రైసు మిల్లులో నాకు పని ఇచ్చారు"

"రైసు మిల్లులో మీరేం పని చేయగలరు?"

"పనివాళ్ళతో సక్రమంగా పని చేయించే పని"

"ఆ పని శ్రీధర్ చేస్తుండేవాడే"

"అతడు డ్రైవింగ్ నేర్చుకోవడానికి ఔరంగాబాద్ వెళ్ళిపోయాడు. అన్నట్టు అడగడం మరచి పోయాను. ఇన్నాళ్లూ మీరు ఎక్కడ వున్నారు?"

"హైద్రాబాద్‌లో మాచిన్నమ్మ ఇంట్లో"

"ఎప్పుడు వచ్చారిక్కడికి?"

"గంట క్రితం"

"మీ అమ్మ ఎక్కడికి వెళ్లారు?"

"ఈ వూళ్లోనే మా మేనత్త వుంది. వాళ్ళ ఇంటికి వెళ్ళింది.

"టైమెంతయింది?" ఆమె రిస్టువాచికేసి చూస్తూ అడిగాడు.

"మూడు"

ప్రకాశ్ గబగబా బయటకు వెళ్ళిపోయాడు. సరిగ్గా నాలుగు గంటలకు తిరిగి ఇంటికి వచ్చాడు.

మణిమాల కాఫీ తెచ్చి ఇచ్చింది. ప్రకాశ్ తాగి బయటకు పోబోయి ఆగి మణిమాల వైపు తిరిగి ఇంతకు పూర్వం తనకు ప్రేమకు జరిగిన మాటలను నవ్వుతూ చెప్పేశాడు.

మణిమాల చిన్నగా నిట్టూర్పు విడిచి అంది "దానికి సినిమాల పిచ్చి ఎక్కువబాబూ. సినీమాలు చూడడం సినీమా పత్రికలు చదవడం వల్ల చదువును అశ్రద్ధ చేస్తూవుంది. ఈ సంవత్స

రం బోర్డు పరీక్ష కూడాను ఎలా పాసవుతుందో ఏమో''

"ఏం చదువుతుందేమిటి?"

"పదవది. శ్రద్ధగా చదివితే ఈ పాటికి ఇంటర్ మీడియట్లో వుండేది. ఏడవ తరగతిలో ఫేలయింది. ఎర్రగా బుర్రగా వుంటేనే సరిపోయిందా. తెలివిలేని పిల్లను ఎవరు పెళ్ళాడుతారు"

ప్రకాశ్ చిన్నగా నవ్వాడు.

"ప్రభాకర్ ఫరవాలేదు బాబూ! వాడు ఇంటర్లో ఫస్టు క్లాసులో పాసయ్యాడు. మా అల్లుడు అంటే ప్రేమకు కాబోయే భర్త హైదాబాద్లో డాక్టర్ కోర్స్ చదువుతున్నారు. ఈ మెద్దది కనీసం బి.ఏ. అయినా పాసుకాకపోతే ఆ అబ్బాయి చేసుకుంటాడో లేదో అని నా భయం" మణిమాల చెప్పడం ఆపడంతో ప్రకాశ్ రైసు మిల్లు వైపు పోబోయాడు.

"ప్రకాశ్" పిలిచిందామె.

ప్రకాశ్ వెనుదిరిగి చూశాడు.

"ప్రతిరోజు రాత్రి ఓ గంటసేపు దానికి ఏదైనా చెప్పతూ వుండు. ముఖ్యంగా లెక్కల్లో అది చాలా వీక్గా వుంది"

"నేనా!" ఆశ్చర్యంగా అడిగాడు ప్రకాశ్.

"అవును నువ్వేబాబూ. నువ్వు తెలివికలవాడవని నాకు తెలుసు. ముఖ్యంగా నేను గమనించింది లెక్కల్లో, మావాడు ఫస్టు క్లాసు స్టూడెంటే అయినా నీలాగా ఇరవై ఏడో ఎక్కమో, యాభై ఆర్లో ఎక్కమో టకటక చదివేయలేడు. ఆ ప్రతిభ నీలోవుంది. నీకేం అనుమానం వద్దు. మేమెంత పని చెప్తుంటామో-చేసే వాళ్ళకు అంత ప్రతిఫలం ఇస్తుటాం"

"నేను ప్రతిభకలవాడినని మీరు భావిస్తే నాశక్తి వంచన లేకుండా మీ అమ్మాయికి సహాయం చేస్తాను" అని చెప్పి వెళ్ళి పోయాడు.

మణిమాల అక్కడేవున్న కుర్చీలో కూర్చుంది. ఇంటి ముందుకు కారు వచ్చి ఆగింది. గోపాలరావుగారు లోపలికి వస్తూ "ఏమిటే ఆలోచిస్తూ కూర్చున్నావు" అన్నాడు.

మణిమాల లేచి నిలబడి అంది "మన అమ్మాయి విష యమే. మీరేమో రాజకీయాలలో మునిగి పోతున్నారాయే. అమ్మాయి విషయం పట్టించుకోరైతిరి'

"ఏం చేయమంటావే ఇప్పుడు"

"అది ఎలాచదువు కుంటుందో ఎప్పుడైనా ఆలోచించారా?"

"నువ్వు బాగా ఆలోచిస్తున్నావని నేను ఆలోచించడం మాను కున్నాను. అది సరేగానీ బుధవారం రాత్రి మన ఎం. ఎల్. ఏ గారు ఇక్కడికి వస్తున్నారు. పదిమందికి వంట స్పెషల్‌గా చేయిం చాలి. మరో ఇరవై మందికి ఆర్డినరీగా చేయించాలి అన్నట్టు ప్రకాశ్ ఎక్కడ వున్నాడు?"

"రైసు మిల్లు వైపు వెళ్లాడు. రాత్రిపూట అతనికి ఏ పనీ చెప్పకండి ప్రేమకు ట్యూషన్ చెప్పేపని అప్పగించాను"

"ట్యూషన్లు చెప్పడానికి ఎంతమంది టీచర్లులేరు"

"ఉన్నారు. లోగడ చెప్పారుగా"

"అది వింటేగా"

"వినే ఆసక్తిని వాళ్ళు కలిగించలేరుగా"

"ప్రకాశ్ కలిగిస్తాడంటావా?"

" కలిగిస్తాడనే నావిశ్వాసం "

" అలా అయితే మరో పిల్లవాడిని వెతుక్కోవలసి వస్తుంది,,

" ఎందుకేమిటి? "

" రాజశేఖరంగారు అదే మన ప్రస్తుత ఎం. ఎల్. ఏ.గారు తిరిగి ఎలక్షన్లలో నిలబడుతున్నారు. వారి ప్రచారం కోసం మనం కూడా పాటుబడాలి కదా,,

" అందుకు ప్రకాశ్ లాంటి కుర్రాడెందుకు?,,

" రాత్రిపూట గోడలమీద ఎన్నికల ప్రచార వాక్యాలు వ్రాయడానికి ,,

" ఇంకేం రాజశేఖరం గారు మళ్ళీ అదిచేస్తాం. ఇదిచేస్తాం అంటూ ఉపన్యాసాలు దంచేస్తారన్నమాట చెప్పేవివంద చేసేవి సున్న ,,

" ఎందుకే అలా విమర్శిస్తావు. ఆయన ప్రజలకు ఏమి చేసినా చెయ్యకపోయినా మనలాంటి వాళ్ళకు ముఖ్యంగా మనకు ఎన్ని సహాయాలు చేయలేదు,,

మణిమాల నవ్వుకుంటూ అక్కడినుండి వెళ్ళిపోయింది

* * *

ప్రకాశ్ కుర్చీలో కూర్చుండి వున్నాడు.

ప్రేమ మంచములో కూర్చుండి లెక్కచేస్తూవుంది.

ప్రకాశ్ పాఠాలు చెప్పడం ప్రారంభించి అయిదురోజు లయింది. ఈ అయిదు రోజుల్లో లెక్కలు చేయడంలోనూ మిగతా సబ్జెక్ట్సు చెప్పినప్పుడు శ్రద్ధగా వినడంలోనూ ప్రేమ ఆసక్తికన

బరుస్తూ వుంది. దానికి కారణాలు చాలా ముఖ్యమైనవి రెండు. మొదటిది ప్రకాశ్ కంఠం మృదు మధురంగా వుండడం, రెండవది ప్రేమ అభిమాన నటుడు శోభన్‌బాబులా ప్రకాశ్ ముఖ కవలికలు వుండడం. శోభన్‌బాబు నటించిన సినిమాలంటే ప్రేమ చాలా ఇష్టపడుతుంది.

ప్రేమ లెక్కచేసి నోటుబుక్ ప్రకాశ్ కందించింది.

ప్రకాశ్ లెక్కలోని ఒక్కొక్క స్టెప్‌ను చూడసాగాడు. అది చక్రవడ్డీ లెక్క. నాల్గవ స్టెప్‌లో ఒకఅంకె తప్పువేయడంతో జవాబు తప్పింది. ప్రకాశ్ చేసి చూపించాడు.

ప్రకాశ్ మరో లెక్క చెప్పబోయాడు.

"ప్రేమా!" బంగ్లా క్రింది నుండి ఎవరో పిలిచారు.

"ఇప్పుడే వస్తానండి" అని చెప్పి క్రిందికి వెళ్ళిపోయింది ప్రేమ. పదినిముషాల తర్వాత మళ్ళీ పైకి వచ్చిన ప్రేమకు ప్రకాశ్ కుర్చీలో నిద్రపోతూ కనిపించాడు.

"ప్రకాశంగారూ!"

ప్రకాశ్ మాట్లాడలేదు.

"ప్రకాశం గారూ!" ఈసారి ఆమె అతని భుజముపై చేయివేసి ఊపుతూ పిలిచింది.

అతను కళ్ళు విప్పి 'సారీ' అన్నాడు.

"నేనే మీకు సారీ చెప్పుకోవాలి. మా స్నేహితురాలితో మాట్లాడి రావడం వల్ల ఆలస్యమైపోయింది"

ప్రకాశ్ ఇంగ్లీషు పుస్తకం చేతిలోకి తీసుకొని అన్నాడు. "నిన్న చెప్పిన స్టోరీ జ్ఞాపకం చేశారా?"

" లేదండి "

ప్రకాశ్ క్షణమాగి అన్నాడు " ఈరోజు మ్యాట్నీకి వెళ్లారు అవునా?"

" కాదు "

" పోనీ ఎక్కడికి వెళ్లారో చెప్పండి"

" ఈదడానికి "

" ఈదడానికా !" ప్రకాశ్ ఆశ్చర్యపోయాడు. " మీకు ఈత వస్తుందా?" అంటూ అడిగాడు.

" ఈత అంటే నాకు చాలా ఇష్టం "

" అది సరే మీరు ఎక్కడ ఈదుతారు "

" కోనేరులో "

" ఎక్కడ వుందది "

" మన ఇంటి వెనుకనే "

" ఈత అంటే నాకూ ఇష్టమే రేపు నాకా కోనేరును చూపిస్తారా"

" తప్పకుండా " అని నేలకు ముఖంవేసి అంది" రేపు స్టోరీ మీకు అప్పగిస్తాను కాని ఈరోజు........."

" చెప్పండి సందేహమెందుకు?"

" మీరు అనుమతి ఇస్తే సినిమాకు వెళ్తాను. మా స్నేహితురాలు వచ్చింది అందుకే "

" నా అనుమతా!"

" అవును మీ అనుమతే. అమ్మనడిగితే మీ అనుమతి తీసుకొని వెళ్ళమంది"

ప్రకాశ్ ఆశ్చర్యంగా చూచి అన్నాడు “మీఇష్టం”

“అలాకాదు. మీరు అనుమతి ఇస్తేనే వెళ్తాను. లేకపోతే అమ్మ తిడుతుంది. మా అమ్మ విషయం మీకు తెలియదేమో మీరు నాకు గురువు అని చెప్పింది. మిమ్మల్ని గౌరవించడం శిష్యురాలిగా నావిధి అని చెప్పింది. మా అమ్మకు చిన్ననాడు చెప్పిన గురువు ఏ బజారులోనో, రైల్వేస్టేషన్‌లోనో కనిపిస్తే దగ్గరకు వెళ్ళి నమస్కరించి ఏ పళ్లో కాని బహూకరించి వస్తుంది. ఆమె గురుభక్తి అలాంటిది”

“సరే వెళ్ళండి” అనిచెప్పి అతడు గబగబా క్రిందికి దిగి వచ్చాడు. క్రింద మణిమాల శోభారాణి మాట్లాడుకుంటూ కూర్చున్నారు. ప్రకాశ్‌ను చూచి అంది మణిమాల “మీరు కూడా వీళ్ళతో కలిసి సినిమాకు వెళ్ళరండి” ఆమె ప్రకాశ్ తెలివితేటలను గమనించి ఈమధ్యనే అతణ్ణి గౌరవించడం అలవాటు చేసుకుంది.

ఇంతకు ముందు ప్రేమ చెప్పిన మాటలు జ్ఞప్తికి వచ్చి “అలాగే” అన్నాడు. అతనికి మణిమాల మీద మరింత గౌరవం పెరిగింది.

ముగ్గురూ సినిమాకు బయలుదేరారు.

* * *

ప్రకాశ్ గదిలోకి వచ్చాడు. ప్రేమ లేచి నిలబడింది. ప్రకాశ్ కుర్చీలో కూర్చుందగానే ఆమె ఎదురుగా వున్న మరొక కుర్చీలో కూర్చుంది.

“శ్లోకం చెప్పమంటారా?” అంది ప్రేమ.

“చెప్పండి”

ప్రేమ చెప్పసాగింది.

గోపాల్‌రావుతో హైదరాబాద్‌కు వెళ్ళిన ప్రకాశ్ మూడు రోజుల తర్వాత ఈరోజే ఇక్కడికి వచ్చాడు. ఈమూడు రోజుల్లో ఒకరోజు మ్యాట్నీ సినిమాతోనూ, ఒకరోజు కోనేరులో ఈతతోనూ గడిపినా మొత్తం మీద ఎలాగో స్టోరీ కూడా జ్ఞాపకం చేసింది.

ప్రేమ స్టోరీ చెప్పిన తీరును విని ప్రకాశ్ సంతృప్తిగా తలవూపి అన్నాడు ,, మనం ఏపని చేపట్టినా దానిని సాధించే వరకు విశ్రమించకూడదు ''

ప్రేమ అంది ' మీరు చెప్పిన మాటలను నేనెప్పుడూ జ్ఞాపకం వుంచుకుంటాను''

ప్రకాశ్ సైన్సు పాఠం చెప్పసాగాడు. హఠాత్తుగా కరెంటు పోయింది.

ప్రేమ అంది ,,ఇక్కడ ఆ గూట్లో కొవ్వొత్తి వుండాలి. తెస్తానుండండి ''

ప్రేమ గూట్లోవున్న కొవ్వొత్తి పట్టుకొని తిరిగి వస్తుండగా త్రోవలో వున్న పెట్టె తట్టుకొని ప్రకాశ్ పైన పడిపోయింది. ప్రకాశ్ కుడిచేయి ఆమె పడిపోకుండా ఆపి వేసింది. కాని అతడు కూడా పడిపోబోయి ఎలాగో నిలద్రొక్కుకున్నాడు. ఆమె వక్షస్థలం అతని ఛాతి మీద ఆనింది. ఆమె శరీరంలో విద్యుత్తు ప్రసరించి నట్టు అనుభూతి చెందింది. అతడు ఆమెను సిటారుగా నిలబెట్ట చూశాడు. ఆమె అతనిని విడవకుండా పట్టుకొని స్పర్శ సుఖం అనుభవించ సాగింది. హఠాత్తుగా లైటు వచ్చేసింది. ఆమె అతనిని వదిలేసి క్రిందికి పరుగెత్తింది. అతడు కుర్చీలో కూర్చున్నాడు.

రెండు నిమిషాల తర్వాత ఆమె తిరిగి వస్తూనే అంది. ''మొన్న మీకు కోనేరు చూపిస్తానని చెప్పి చూపించనే లేదు. అయామ్ సారీ '

ప్రకాశ్ అదేమీ వినిపించుకోకుండా అన్నాడు ''చీకటివల్ల ఎంత ఇబ్బందో చూశారా? కాస్తలో తప్పిపోయింది గానీ లేకపోతే పెద్దదెబ్బ తగిలేది మీకు ''

''మీరు ఎలాగో నిలద్రొక్కుకున్నారు గానీ లేకపోతే మీరు పడిపోవడం మీ మీద నేను పడిపోవడం జరిగేది'' అందామె అతని కళ్ళల్లోకి చూస్తూ.

ప్రకాశ్ కూడా ఆమెను ఆసక్తిగా చూస్తూ ఆమె దగ్గరకు నాలుగడుగులు వేసి హఠాత్తుగా ఆగి వెనుదిరిగి గబగబా క్రిందికి వెళ్ళిపోయాడు.

అతడు మళ్ళీ తిరిగి వస్తాడేమోనని ఎదురు చూచిందామె. అరగంట గడచినా రాకపోవడం వల్ల లైటు తీసేసి పడుకుంది. '' ప్రకాశ్ స్థానంలో నిగ్రహంలేని మరో మగాడుంటే తననా చీకట్లో ఏంచేసేవాడో'' ఈ ఆలోచన రాగానే ఆమె మనస్సులో మధురమైన కోరికలు చెలరేగాయి. ప్రకాశ్ అంటే ప్రేమాభిమానాలు ఇనుమడించాయి.

* * *

"ప్రకాశంగారూ!" పిలిచింది ప్రేమ.

రైసు మిల్లు ప్రక్కన వున్నగదిలో కూర్చుండి ఏవో లెక్కలు వ్రాస్తున్న ప్రకాశ్ తిరిగి చూశాడు. ఎదురుగా ప్రేమ కనిపించింది. అతడు నోటు బుక్కు టేబుల్‌పై వదిలి పెన్ను

జేబులో పెట్టుకొని బయటకు వచ్చాడు.

"ఇంకా పనేమైనావుందా?" అడిగింది ప్రేమ.

"ఎందుకు?"

"కోనేరు చూపిస్తా నన్నానుగా"

"అలాగా అయితే ఇప్పుడే వస్తానుండండి" అని చెప్పి రైసు మిల్లులోకి వెళ్ళి పదినిమిషాల తర్వాత తిరిగి వచ్చాడు.

ప్రేమ బంగ్లా ప్రక్కనవున్న గేటుతాళం తీసింది. ఇద్దరూ లోపలికి ప్రవేశించారు. చుట్టూ ఎత్తుగా ప్రహారీగోడ వుంది. అది రెండెకరాల తోట. అందులో కొబ్బరి, నిమ్మ, జామ, మామిడి అరటి, ఇంకా రకరకాల పూల చెట్లున్నాయి. తోట చాలా అందంగా వుంది.

వాళ్ళా చెట్లను చూస్తూ ముందుకు నడుస్తున్నారు. నిమ్మ చెట్లు దాటి వెళ్ళాక కోనేరు కనిపించింది. కోనేరు చుటూ నిమ్మ చెట్లున్నాయి.

ప్రేమ కోనేరు నానుకొనివున్న గద్దెపై నిలబడి అంది "ఇక్కడికి రండి"

ప్రకాశ్ ప్రేమ ప్రక్కకు వెళ్ళి నిలబడినాడు. ప్రేమ వ్రేలితో చూపిస్తూ ఈ మధ్యనే హైద్రాబాద్ నుండి తెప్పించి నాటిన కొత్త మొక్కలపేర్లు చెప్పసాగింది.

ప్రకాశ్ ఆ చెట్లను చూస్తూ ఆనందంతో అన్నాడు. "చాలా బాగుంది ఇన్ని సౌకర్యాల మధ్య జీవిస్తున్న మీరు చాలా అదృష్ట వంతులు. ఈ కోనేరును చూస్తూంటే గంటల తరబడి ఈదాలన్న కాంక్ష కలుగుతోంది"

" మీకు ఈతవచ్చా?" చిలిపిగా చూస్తూ అంది ప్రేమ.

ప్రకాశ్ నవ్వాడు.

" నవ్వడం కాదు. ప్రత్యక్షంగా చూస్తే తప్ప నేను అంగీకరించను"

" ఈదడానికి నాకేం అభ్యంతరంలేదు. కాని నేను ఈదుతుండగా మీరు చూస్తుండగా మరెవరైనా చూస్తే"

" ఇక్కడికి రావడానికి ఇప్పుడు మనం వచ్చిన గేటుతప్ప మరో గేటు లేదు. ఆ గేటుకు తాళం వేసి వచ్చాను

ప్రకాశ్ కోనేరు వైపు తిరగబోయాడు. కాలు జారింది. పడబోయాడు. ప్రేమ అతణ్ని పట్టుకోబోయింది. కాని బ్యాలెన్సు ఆగలేదు. ఇద్దరూ కోనేరులో పడిపోయారు.

ప్రేమ చీర అంచులు నీళ్ళపైకి వచ్చి తేలియాడసాగాయి. ప్రకాశ్ ఆమె వైపు ఒకసారి చూచి వెంటనే దృష్టి మరోవైపు త్రిప్పి అన్నాడు " సారీ నామూలంగా మీరు తడిసిపోయారు"

" ఫర్వాలేదు" అని చెప్పి ఆమె ఈదుకుంటూ వెళ్ళి గట్టెక్కింది.

ప్రకాశ్ పావుగంటసేపు ఈది గట్టెక్కాడు. అతనికి ప్రేమ కనిపించలేదు. కాని ఆమె వెళ్ళిన మార్గాన్ని నీటిధారలు చూపిస్తున్నాయి. ప్రకాశ్ నీటి ధారలను అనుసరిస్తూ గున్న మామిడి చెట్టుకు ఉత్తర భాగాన వున్న గది వద్దకు వెళ్లాడు. మూసివున్న ఆ గది తలుపులు తెరచి లోపల ప్రవేశించాడు. ఎదురుగా దూలానికి వ్రేలాడదీసిన కాన్వాసు గుడ్డ మీద అందమైన రంగుల్లో చిత్ర సుందరి కనిపించింది.

ప్రకాశ్ ఆ సుందరిని కుతూహలంగా చూశాడు. ఈబొమ్మను గీసిందెవరో కానీ అతడు గొప్ప ఆర్టిస్టు అయి వుండాలి అనుకున్నాడతడు.

ప్రకాశ్ దృష్టి కాన్వాసుగుడ్డ మీది నుండి గోడదగ్గరవున్న పట్టె మంచం మీదికి మళ్ళింది. దాని మీద ఇంతకు ముందు ప్రేమ ధరించిన చీర, జాకెట్టు, లంగా, బాడీ ఆరవేసి వున్నాయి.

"ప్రకాశం గారూ! మీరు చాలా సేపు కొలనులోనే ఈదుతారనుకున్నాను. అనుకోకుండా వచ్చేశారు. ఫర్వాలేదు కొంచెం సేపు కళ్ళు మూసుకుంటారా. బట్టలు ఆరినట్టున్నాయి కట్టుకుంటాను' అంది ప్రేమ. ఆమె కాన్వాసు గుడ్డ వెనుకే నిలబడి వున్నట్టు గ్రహించాడతడు.

"అయామ్ సారీ మీరీ పరిస్థితిలో వున్నారని నాకు తెలియదు. కళ్ళు మూసుకోవడ మెందుకు? బయటికే వెళ్ళిపోతాను"

"బయటకు వెళ్ళిపోవడమెందుకు? కొన్ని నిమిషాలసేపు కళ్ళుమూసుకొని వుండగలిగే ఏకాగ్రత గానీ నిగ్రహ శక్తిగానీ లేవా మీకు?"

"సవాల్ చేస్తున్నారా? అయితే కళ్ళు మూసుకుంటున్నాను. మీరు తెరవమనేంతవరకు తెరవను సరేనా......" అని కళ్ళు మూసుకున్నాడతడు.

కాన్వాసు గుడ్డ వెనుక నగ్నంగా నిలబడి వున్న ప్రేమ గబగబా వెళ్ళి బట్టలను తీసుకోబోయింది మంచం కుడిప్రక్క భాగాన నాగసర్పం కనిపించింది. ఆమె భయంతో కెవ్వుమని అరచి ప్రకాశ్ దగ్గరకు పరుగెత్తి వచ్చింది

"ఏమిటీ?" అన్నాడతడు.

"కళ్ళు తెరచి చూడండి"

అతడు కళ్లు తెరచి ప్రేమ వైపు చూశాడు.

"మంచం వైపు చూడండి" అందామె

అతడు మంచం వైపు చూశాడు. పాము కనిపించింది దానిని క్షణంసేపు పరిశీలనగా చూచిన అతడు రివ్వున వెళ్లి దాని పడగ దగ్గర పట్టుకున్నాడు. అది విలవిలా తన్నుకోసాగింది" అతడు గది బయటకు వెళ్ళి ఖాళీ చేతులతో తిరిగి వచ్చేసరికి ప్రేమ చీరె కట్టుకొని పైట వేసుకొంటూ కనిపించింది.

"పామును చూస్తే మీరంత భయపడుతారని నాకు తెలియదు" అన్నాడతడు.

"పామును చూడగానే రివ్వున వెళ్ళి మీరంత నైపుణ్యంతో పట్టుకుంటారని నాకూ తెలియదు. నాగుపామును చేతితో పట్టుకోగా చూడడం నా జీవితములో ఇదే మొదటిసారి. ఎంత నైపుణ్యం వున్నా విష సర్పాన్ని అలా పట్టుకోవడం మంచిది కాదేమో"

"యవ్వనంలో వున్న అమ్మాయిని నగ్నంగా చూడడం నా జీవితంలో ఇదే మొదటిసారి. మీకెంత నిగ్రహం వున్నా ఒక పురుషుని ఏకాగ్రతను, నిగ్రహాన్ని సవాల్ చేస్తూ నగ్నంగా ముందుకు రావడం మీకూ మంచిది కాదేమో"

ఆమె నవ్వి అంది "నేనెప్పుడూ ఏ పురుషుని ఏకాగ్రతను నిగ్రహాన్ని సవాల్ చేయలేదు. కాని అడుగడుగునా మీలో కని పిస్తున్న ప్రత్యేకతలు నన్ను ముగ్ధురాల్ని చేస్తున్నాయి. సవాల్ చేయాలన్న కాంక్షను ప్రేరేపిస్తున్నాయి"

" నేను నిగ్రహం కోల్పోయే సందర్భం వస్తే.........
క్షమించండి"

" క్షమించడంకాదు. మీరు ఇకముందు నాదగ్గర నిగ్రహం పాటించవలసిన అవసరంలేదు. మీ ఇష్టమున్నట్టుగా నన్ను......
నేను......నేను మిమ్మల్ని ప్రేమిస్తున్నాను. ఆనాటి రాత్రి కరంటు పోయాక కొవ్వొత్తి పట్టుకొని తిరిగి వస్తుండగా మీ మీద పడి పోయాను గుర్తుందా మీకు?"

గుర్తుందన్నట్టు తలవూపాడు ప్రకాశ్.

" ఆనాటి నుండి మీ శరీరాన్ని మళ్ళీమళ్ళీ తాకాలన్న కోరిక కలుగుతూ వుంది"

" నాకూ అలాగే అనిపిస్తూవుంది. కాని......కాని మన కోరిక ఎలా నెరవేరుతుంది"

" పెళ్ళి చేసుకుందాం"

" పెళ్లా! మీరు ధనవంతులు. నేను బీదవాణ్ని పైగా మీ జీతగాణ్ని. మీరు నన్ను పెళ్ళి చేసుకుంటానంటే మాత్రం మీనాన్నగారు అంగీకరిస్తారా?"

ప్రేమ ఏదో చెప్పబోయింధి.

ప్రకాశ్ ప్రసంగం మారుస్తూ అడిగాడు " కాన్వాసు గుడ్డ మీద వున్న బొమ్మను ఎవరు గీసారు?"

" మా చిన్నాన్న "

" అయితే దీనిని ఇక్కడ ఎందుకు వ్రేలాడదీశారు?"

ప్రేమ గాఢంగా నిట్టూర్పు విడిచి చెప్పసాగింది.

చిన్నాన్న హైదాబాద్‌లో చదువుకుంటుండగా చిన్నాన్న

ఈమె పరస్పరం ప్రేమించుకున్నారు. ఈమె తండ్రి కోటీశ్వరుడు మేడల్లో నివసిస్తూ కార్లల్లో తిరిగిన అందమైన నాజూకైన అమ్మాయి ఈమె. శరీరం ఎంత మృదువో మనస్సు అంత మృదువు. తాను మా చిన్నాన్నను ప్రేమించినట్లు వాళ్ళ నాన్నకు మృదువుగా చెప్పేసింది. వాళ్ళ నాన్న ఈ విషయం విని భరించలేక పోయాడు. కూతురును తీవ్రంగా మందలించాడు. మృదువైన ఆమె మనస్సు గాయపడింది. అప్పుడు సెలవులు కావడం వల్ల చిన్నాన్న హైద్రాబాద్‌లో వున్న వాళ్ళ ఇంటికి వెళ్లాడు. ఆ అమ్మాయిని గదిలో బంధించి వుంచినట్లు పని మనుషుల ద్వారా తెలిసిందట. ఆమె తండ్రి చిన్నాన్నను అనరాని మాటలన్నాడట. చిన్నాన్న నిరాశతో బాధతో ఈవూరికి తిరిగి వచ్చాడు. తర్వాత పదిరోజుల కనుకుంటాను ఆమె చనిపోయినట్లు ప్రముఖ వార్తా పత్రికల్లో ఫోటోలు ఇచ్చారు. చిన్నాన్న ఆ వార్తాపత్రికను పట్టుకొని ఇదే గదికి వచ్చాడు. ఆ రోజు సాయంకాలం నుండి వరుసగా నాలుగు రోజులు శ్రమపడి ఈ గుమ్మటంపై ఆమె చిత్రాన్ని గీసాడు. ఆ తర్వాత రోజు మధ్యాహ్నం దాటిపోయినా భోజనానికి రాకపోయే సరికి అమ్మ నన్ను ఈ గదిలో చూచి రమ్మంది. నేను వచ్చి చూశాను. చిన్నాన్న చనిపోయి వున్నాడు. ప్రక్కన మిగిలిపోయిన నిద్రమాత్రలు రెండు దొరికాయి........ ...''

ప్రేమ చెప్పటం ఆపి ప్రకాశ్ ముఖంలోకి చూచింది.

ప్రకాశ్ అడిగాడు "మీ చిన్నాన్న చనిపోయి ఎన్నాళ్ళ యింది?''

"మూడున్నర సంవత్సరాలు......'' క్షణంసేపు మౌనం

వహించిన ప్రేమ మళ్ళీ చెప్పసాగింది. 'ఇక్కడ ప్రశాంతంగా వుంటుందని, చదువుకోవడానికి బాగుంటుందని చిన్నాన్న చనిపోవడానికి రెండు సంవత్సరాల ముందు ఈ గదిని కట్టించారు. చిన్నాన్న చనిపోయాక చిన్నాన్న ఫోటోలను పుస్తకాలను ఇంకా చిన్నాన్నకు సంబంధించిన అన్ని వస్తువులను ఈగదిలోనే భద్రపరిచారు. చిన్నాన్న చనిపోయిన ఈ మూడున్నర సంవత్సరాల నుండి నాన్నగారు ఒక్కసారైనా ఈగది వైపు రాలేదు. చిన్నాన్న చనిపోయిన తొలి రోజుల్లో నాన్న మానసికంగా చాలా కృంగిపోయారు. తర్వాత కాలంలో రాజకీయ నాయకులతో స్నేహంచేసి ఏయే విధాలుగా డబ్బు సంపాదించ వచ్చునో ఆయా విధాల్లో డబ్బు సంపాదిస్తున్నారు. ఈ మధ్యకాలంలో మా ఆస్తి మూడురెట్లు పెరిగిందని అమ్మ అంచనా వేసి చెప్పింది''

ఆ తర్వాత ఇద్దరూ ఏదో ఆలోచిస్తూ మౌనంగా వుండిపోయారు.

ప్రకాశ్ మందహాసం చేసి అన్నాడు " ధనవంతులు ధనవంతుల తోనే వియ్యం పొందాలనుకుంటారు. యవ్వనంలోవున్న మనలాంటివాళ్ళం ఏదో ఆకర్షణకులోనై అవేవీ ఆలోచించం...''

" మీరు మరేవిధంగానూ ఆలోచించకండి. నన్ను మీ భార్యగా చేసుకోవడానికే మీ ఆలోచనల్ని ఉపయోగించండి''

" మీనాన్న ఏవిధంగానూ ఒప్పుకోకపోతే"

" మీతో ఎక్కడికయినా వచ్చేస్తాను"

" జీవితమంటే సినిమా కాదు. ఆస్తిపాస్తులు లేకుండా జీవితాలు గడపడం ఎంత కష్టమో మీకు తెలియదు''

"మీరు ఇలాగే మరెక్కడైనా ఉద్యోగం చేస్తూ నన్ను పోషించలేరా?"

"నేను పోషించగలనేమో కాని అనేక సుఖాలలో పెరిగిన మీరు దరిద్రాన్ని అనుభవిస్తూ నాతో కలసి జీవించగలరా?"

"అలాంటి అనుమానం మీరేమీ పెట్టుకోవద్దు. అలా అయితే ఈరోజు నుండే సుఖాలకు దూరంగా వుంటాను"

"మీరు మరి కొన్నాళ్లు బాగా ఆలోచించండి అప్పటికీ మీ అభిప్రాయం మారకపోతే మీ నాన్నతో ధైర్యంగా చెప్పెయ్యండి"

"అలాగే......అలాగే" అంది ప్రేమ.

"మీ అభిప్రాయాన్ని మీ నాన్నకు చెప్పినప్పుడు మీ నాన్న అంగీకరించక మిమ్మల్ని ఒకవేళ గదిలో బంధిస్తే ఆత్మ హత్య చేసుకోనని మాట ఇవ్వండి"

ప్రేమ మాట ఇచ్చింది.

గులాబీ చెట్టు వైపు చూస్తున్న ప్రకాశ్ అన్నాడు "గులాబీ పువ్వు చాలా అందంగా మృదువుగా వుంటుంది. పువ్వు నలగకుండా దాని ప్రక్కన వుండే ముళ్ళు కుచ్చుకోకుండా పువ్వును పొందా లంటే కొంతైనా నేర్పరితనం వుండాలి. కాని మీలాంటి అందమైన అమ్మాయిని, ధనవంతుల ఇంట్లో పుట్టిన అమ్మాయిని ఎవరికీ బాధ కలుగకుండా పొందాలంటే అపారమైన తెలివి తేటలు, నేర్పరితనం వుండాలి."

"ఆ తెలివితేటలు, నేర్పరితనం మీకు వున్నాయని, వుండా లని ఆశిస్తున్నాను"

"మీ ఆశలు నెరవేరుగాక" నవ్వుతూ అన్నాడతడు.

ప్రేమ మౌనం వహించింది.

"చాలా ఆలస్యమైంది. వెళ్దాం పదండి" అన్నాడతడు.

ఇద్దరూ ఇంటివైపు బయలుదేరారు.

* * *

"రేపు ఉదయం పదిగంటలకు పెళ్ళి చూపులవాళ్ళు వస్తున్నారు. అందుకు కావలసిన ఏర్పాట్లన్నీ నువ్వే చేయించు నాకీరోజు సాయంత్రం వరంగల్లో పనివుంది. నేను వెళ్తున్నాను" అని చెప్పి గోపాలరావు గారు వచ్చినంత వేగంగా వెళ్ళిపోయారు.

ఈ వూళ్లో వున్న గోపాల్‌రావుగారి అక్క తనకుమారునికి ఎక్కువ కట్నానికి ఆశపడి ప్రేమతో కాకుండా మరో అమ్మాయితో పెళ్ళి నిర్ణయించడంతో గోపాల్‌రావు గారికి ఒకవైపు అక్కమీద కోపం, మరోవైపు అంతకంటే ధనవంతునికి, చదువుగల వానికి ప్రేమనిచ్చి పెళ్ళి చేయాలన్న పట్టుదల వచ్చేశాయి. పెళ్ళి కుమారుల కోసం వెదకుతుండగా పెళ్ళిళ్ళ రామయ్య మంచి సంబంధం అంటూ ఓ సంబంధం తీసుకవచ్చాడు. ఈసంబంధం కుదిరితే ప్రేమ పెళ్ళిని సాధ్యమైనంత తొందరగా చేసేసి తన కూతురును కాదన్న అక్కముందు గర్వంగా తిరగాలని వుందతనికి.

తల్లి చెప్పిన ఈ విషయం విని ప్రేమ ముఖం మాడ్చుకుంది.

"నా పెళ్ళికి ఇప్పుడే తొందరేమిటమ్మా. నాకు ఇప్పుడిప్పుడే చదువులు చదువుకోవాలన్న కుతూహలం కలుగుతూ వుంది. పెళ్ళి, పిల్లలు ముందు ముందు ఎలాగూ తప్పవు. కాని ఈ చదువులు వయసు మీరిపోయాక చదువుకోవడం సాధ్యం కాదు

కదమ్మా''

"నిజమే కాని అత్తయ్యావాళ్ళు బావకు మరో అమ్మాయిని నిర్ణయించుకోవడంతో మీనాన్నగారు నీకు తొందరగా పెళ్ళి చేయాలని ఆరాటపడుతున్నారు''

'నా అభిప్రాయం ఏమిటో తెలుసుకోకుండా పెళ్లి చూపులు ఏర్పాటు చేయడమేమిటి?''

మణిమాల మాట్లాడలేదు.

''నాన్నగారు యీపెళ్ళిచూపుల ఏర్పాటు మానుకుంటేనే బాగుంటుంది లేకపోతే వచ్చిన వాళ్ళతో నేనే సూటిగా చెప్పేస్తాను''

"ఏమని చెప్తావే''

''నాకు పెళ్ళిచేసుకోవడం ఇప్పుడే ఇష్టం లేదని''

*   *   *

గోపాలరావు గారు లోపలికి వచ్చారు. ఆయన ముఖం నిరుత్సాహంగా వుంది. అది గమనించిన మణిమాల అడిగింది. ''ఏమిటండి అలావున్నారు?''

''జగన్నాథరావు-అంటే కరీంనగర్‌లో చదువుకునేరోజుల్లో మిత్రుడు—ఓ రహస్యం చెప్పాడు''

మణిమాల ఏమిటన్నట్టు చూచింది.

'' ఆ పిల్లవానికి సుఖవ్యాధులున్నాయట. వాళ్ళు చాలా ధనవంతులన్నమాట నిజమేనట. కాని ఆపిల్లవాడు ఎం. ఎస్. సి. పాసైనా మాట కూడా అబద్ధమేనట. వస్తుండగా శివాలయం దగ్గర పెళ్ళిళ్ళ రామయ్య కూడా కలిశాడు''

'' అతడేమన్నాడు?''

"అతనికే విషయాలేవీ తెలియవని నొచ్చుకున్నాడు"

"ముందుగా తెలిసింది కాబట్టి సరిపోయింది. లేకపోతే అలాంటి వానితో ఎంత ఇబ్బంది పడాల్సి వచ్చేదో దానికి "

"అంతా దాని అదృష్టం"

* * *

" అమ్మాయి ఎక్కడ వుంది? "

ఇంతకు ముందు అట్లాసు పట్టుకొని మేడపైకి వెళ్ళింది. అక్కడే వుందేమో ఇప్పుడు దానితో పనేముంది?"

"రేపు దాని పుట్టిన రోజు పండుగ గుర్తుందా నీకు"

ప్రతి సంవత్సరం లాగే యీ సంవత్సరం కూడా ఫోటో దిగిరమ్మంటే బాగుంటుంది కదా!" అనిచెప్పి గోపాల్‌రావుగారు మేడమీదికి వచ్చేశారు. గది తలుపులు దగ్గరకు వేసి వున్నాయి. అతడా తలుపులు తెరచి లోపలికి వెళ్లాడు. టేబుల్ మీద ఒక పుస్తకం దానిపక్కన ఆల్బమ్ కనిపించాయతనికి. అతడా టేబుల్ దగ్గరవున్న కుర్చీలో కూర్చుండి పుస్తకం చేతిలోకి తీసుకున్నాడు. అది ఇంగ్లీషు నాన్‌డిటేల్ పుస్తకం. పుస్తకం తిరిగేస్తుండగా నీలిమ ఫోటో దానిలో నుండి టేబుల్ మీద పడిపోయింది. అతడా ఫోటోను తిరిగి పుస్తకంలో పెట్టేసి ఆ పుస్తకాన్ని టేబుల్‌మీద పెట్టేశాడు.

ఆల్బమ్ పట్టుకొని తిరగవేయసాగాడు. ప్రీమ వినోద యాత్రలకు వెళ్ళినప్పుడు గోల్కొండ కోటలో, నాగార్జునసాగర్‌లో అజంతా ఎల్లోరాలలో దిగిన ఫోటోలు, పుట్టినరోజు పండుగలకు దిగిన ఫోటోలు, ఫ్రెండ్స్‌తో దిగిన ఫోటోలు, తల్లిదండ్రులతో

బంధువులతో దిగిన ఫోటోలు వరుసగా అమర్చబడి వున్నాయి. అలా పేజీలు త్రిప్పుతుండగా ఒక పేజీలో ప్రేమ ప్రకాశ్‌ల ఫోటోలు ప్రక్క-ప్రక్కన అమర్చబడి వుండడం కనిపించాయతనికి చాలా రోజుల నుండి ప్రకాశ్ ప్రేమ చాలా సన్నిహితంగా వుంటుండగా చూచిన అతడు కూడా ఈ ఫోటోలు ప్రక్క-ప్రక్కగా వుండగా చూచి ఆశ్చర్యపోయాడు. ఆ రెండు ఫోటోలు అలా కనిపించడంతో కొత్త అర్థాలు స్ఫురించాయతనికి. ప్రకాశ్ ఫోటో చాలా అందంగా ఆకర్షణీయంగా వుంది. అతడా ఫోటోను పరీక్షించి చూస్తుండగా బాత్‌రూముకు వెళ్ళిన ప్రేమ గదిలోనికి వచ్చేసింది తండ్రి తన ఆల్బమ్ పట్టుకొని వుండడంతో ఆమె మొదట గాభరాపడిపోయింది. కాని వెంటనే ఎలాగో స్థిమితపడింది.

గోపాల్‌రావుగారు ప్రేమ వైపు తిరిగి అన్నాడు "ఈరోజుల్లో చాలామంది అమ్మాయిలకు మగ స్నేహితులు వుంటున్న మాట వాస్తవమే కాని మగస్నేహితుల ఫోటోలు ఇలా ఆల్బమ్‌లో అమర్చుకోవడం వల్ల ఏమైనా ఇబ్బందులు కలుగవచ్చు''

ప్రేమ అంది'' నాన్నగారూ! మీకోవిషయం చెప్పాలను కుంటున్నాను"

" ఏమిటమ్మా!''

" చెప్పమంటారా?''.

" చెప్పు ''

" నేను చెప్పిన విషయం విన్నాక మీరు కోపగించుకోనని మాట ఇవ్వండి''

" సరే ''

"అంతేకాదు నేను చెప్పే ఈ విషయం గురించి ప్రశాంతంగా ఆలోచించి ఒక నిర్ణయానికి వస్తానని కూడా మాట ఇవ్వండి''

" ఈ ఉపోద్ఘాతమంతా ఎందుకే?''

" ముందు మీరు మాట ఇవ్వండి''

" సరే "

"నా సంతోషంకోసం నేను కోరే కోరిక నెరవేరుస్తానని కూడా మాట ఇవ్వండి''

" సరే ఇక అసలు విషయం ఏమిటో చెప్పు''

" ప్రకాశంగారి మీద మీ అభిప్రాయం ఏమిటి?"

" మళ్ళీ ఇదేం ప్రశ్నే''

" ముందు నేను అడిగిన దానికి సమాధానం చెప్పండి నాన్నా!''

"ప్రకాశ్ మంచి తెలివి కలవాడు''

" అంతేనా?"

" మంచి మనసు కలవాడు కూడా"

"నేను......నేను ప్రకాశంగారిని పెళ్ళిచేసుకోవాలను కుంటున్నాను"

గోపాల్‌రావుగారికి హఠాత్తుగా తన తమ్ముడు, అతడు ప్రేమించిన అమ్మాయి జ్ఞప్తికి వచ్చారు. అతడు కొంచెంసేపు మౌనం వహించి తర్వాత ప్రేమ ముఖంలోకి పరిశీలనగా చూస్తూ అన్నాడు. "ప్రేమా! పెళ్ళి అనేది జీవితానికంతటికీ సంబంధించిన విషయం. ఈవిషయంలో నిర్ణయం తీసుకునే ముందే బాగా ఆలోచించాలి''

"నేను బాగా ఆలోచించే ఈ నిర్ణయానికి వచ్చాను నాన్న"

"ప్రకాశ్ అభిప్రాయం ఏమిటో తెలుసుకున్నావా?"

"మీరు అంగీకరిస్తే అతడు నన్ను పెళ్ళి చేసుకోవడానికి సిద్ధంగానే వున్నాడు"

"నేను అంగీకరించకపోతే" అందామనుకున్నాడతడు. కాని ఆ సమయంలో అతనికి తమ్ముని శవం జ్ఞప్తికి రావడంతో ఆగిపోయాడు. వెనువెంటనే అతని కన్నులు చెమర్చాయి.

"మీకిప్పుడు చిన్నాన్న జ్ఞప్తికి వచ్చారా నాన్న!" అందామె.

అతడదేమీ వినిపించుకోకుండా అన్నాడు "పెళ్ళి విషయంలో ఇంకా బాగా ఆలోచించి నువ్వు తీసుకున్న నిర్ణయాన్ని కాగితం మీద వ్రాసి ఈ నెల 15వ తేదీనాడు నా టేబుల్ మీద పెట్టు. ఆ! అన్నట్టు స్టూడియోకి వెళ్ళి ఫోటో దిగడం మాత్రం మరచిపోకు" అని చెప్పి అతడు భారంగా అడుగులు వేస్తూ వెళ్ళిపోయాడు.

* * *

గోపాల్‌రావు గారు తన టేబుల్ మీద వున్న కాగితాన్ని తీసి చూశాడు. అది ప్రేమ వ్రాసింది.

ప్రకాశ్ ఈ ఇంటికి వచ్చాక అతనివైపు తానెలా ఆకర్షింపబడిందో వివరంగా వ్రాసింది. ప్రకాశ్‌ను పెళ్ళి చేసుకోవడానికి అంగీకారం తెలియజేయ వలసిందిగా ప్రార్థించింది. సుఖపడడానికి డబ్బుకంటే ప్రేమే ముఖ్యమని తెలియజేసింది. ఈ చదువులు, డబ్బులు ప్రతిభవుంటే పట్టుదలతో సాధించుకోవచ్చునని తెలియజేసింది. చివరికి ఇలా వ్రాసింది. "నాన్నా! మిమ్మల్ని

కోరేది ఒక్కటే. నేను ప్రకాశం గారిని పెళ్ళి చేసుకోవడమనేది మీకు ఏ విధంగానూ ఇష్టంలేకపోతే నా దారిన నన్ను వెళ్ళనివ్వండి. మీకు కూతురే జన్మించలేదనుకోండి నన్ను పూర్తిగా మరచిపోండి

మీ కూతురు—ప్రేమ.

గోపాల్‌రావుగారు కాగిదాలు మలచి టేబుల్ మీద పెట్టి శూన్యంలోకి చూస్తూ ఆలోచించసాగారు.

* * *

ప్రకాశ్ హైదాబాద్‌లో చదువుకోవడానికి వెళ్తున్నాడు. ప్రభాకర్‌రావు కూడా అతని వెంట వెళ్తున్నాడు.

గోపాలరావు, మణిమాల, ప్రేమ వాళ్ళను సాగనంపడానికి రైల్వే స్టేషన్ వద్దకు వచ్చారు.

ప్రకాశ్ చదువుకోవడానికి ఆర్థిక సహాయం చేస్తానని హామీ ఇచ్చారు గోపాల్‌రావుగారు. అంతేకాదు ప్రకాశ్ ఎం. బి. బి. ఎస్. పాసై రాగానే ప్రకాశ్‌కు ప్రేమకు పెళ్ళి చేస్తానని కూడా మాట ఇచ్చాడు. ప్రకాశ్ తెలివితేటల మీద నమ్మకం వున్న ప్రేమ తండ్రి తీసుకున్న నిర్ణయానికి సంతోషించింది. ఆత్మ విశ్వాసం వున్న ప్రకాశ్ ఎం. బి. బి. ఎస్. పాసై ప్రేమను పెళ్ళాడాలన్న కృతనిశ్చయానికి వచ్చాడు.

ప్రభాకర్‌రావు రైలు ఎక్కి ప్రకాశ్ అందించిన బ్యాగు అందుకొని లోపల పెట్టాడు. ప్రకాశ్ ఎక్కిన కొద్ది క్షణాలకే గార్డు విజిల్ వూదాడు. రైలు బయలుదేరింది.

—•*•—

# పెంపుడు బొమ్మ కథ

" మారుతీ!....ఒరే మారుతీ......లేవరా నాయనాలే'' గది ముందు నిలబడిన రాధమ్మ తన కొడుక్కు మేలుకొలుపు పాడింది.

గదిలోపల మంచముపై మెత్తని బట్టల మీద మేనువాల్చి మైమరచి నిద్రపోతున్న మారుతి చెవిలో రాధమ్మ మాటలు, ఎలుకలు కన్నములో దూరినట్లు దూరాయి. అయినా అతడు నిర్లక్ష్యంగా మరోదిక్కు తిరిగి ఆవులించి కాస్త కాస్త తొలగిన దుప్పటిని బిర్రుగా కప్పుకొని నిద్రాదేవిని మరోసారి ఆలింగనము చేసుకోవడానికి ప్రయత్నించాడు.

" మారుతీ! ఒరే కోతి వెధవా! ఇంకా నిద్రేమిట్రా బారెడు ప్రొద్దెక్కితేనూ..... పక్కింటి మాస్టారు వద్దకు వెళ్ళి లెక్కలు చెప్పించు కొంటానంటివి గదరా, లే! లేరా రెండు కాళ్ళ గాడిదా''

ఈసారి రాధమ్మ మాటలు, మారుతి కప్పుకున్న దుప్పటిని దాటి అతని చెవిలో దూరినట్లు లేవు. అతడు నల్లిలాగ కదలక మెదలక పడుకునే సరికి రాధమ్మకు కోపం డిగ్రీలలో వుంటే, నూరు డిగ్రీల కోపం వచ్చిందని చెప్పుకోవచ్చు.

రాధమ్మ సరాసరి గదిలోకి వెళ్ళింది. చలి రక్కసి బారిలో పడకుండా మారుతి సురక్షితంగా కప్పుకున్న పచ్చడాన్ని నిర్దాక్షిణ్యంగా లాగేసింది.

మారుతి లేచి కూర్చున్నాడు. అప్పుడతని తల చీకిపారేసిన తాటిపీచులా వుంది. అతడు దుప్పటిని, పక్క బట్టలను కళావిహీనంగా పడేసి గది వెలుపలికి వచ్చి గదిముందు భాగమున గోడకు వ్రేలాడదీసియున్న శ్రీరామచంద్రుని పటం ముందు సాష్టాంగ నమస్కారము గావించాడు. వచ్చిరాని శ్లోకాన్ని తత్తర పడుతూ చదివేసి ఇంటి వెనుకనున్న గద్దె పైకి వెళ్లాడు. ఆకాశ వీధిలో కుంటి గుర్రాల రథంలో వెళ్తున్న సూర్యారావుకు నమస్కరించాడు. మళ్ళీ గదిలోకి వచ్చి దుప్పటి కప్పుకొని ఇంటి వెనుకకు వెళ్ళి గద్దెపై రాతి విగ్రహంలా కూర్చున్నాడు.

రాధమ్మ చెంబునిండా వేడినీళ్ళు తెచ్చి మారుతి ముందుంచి "ముఖం కడుక్కోరా నాయనా! శర్కర పరమాన్నం వండాను. చల్లారిపోతే రుచించదు" అని చెప్పి కుండ పట్టుకొని చెట్లకు నీళ్ళు పోయడానికి పెరట్లోకి వెళ్ళింది.

మారుతి దొంగ పిల్లిలాగా తల్లి వెళ్ళిన వైపు చూశాడు. ఆమె వెంటనే తిరిగివచ్చే సూచనలు కనబడలేదు. అతని మనస్సులో శర్కర పరమాన్నం మెదిలింది. వెంటనే కళ్ళు తెరచి పళ్ళు ఇకిలించాడు. పైనున్న దుప్పటిని బంతిలాగా చుట్టి చెంబుపై పడేశాడు. చెంబు, దుప్పటి గద్దె మీది నుండి క్రిందికి దుమికాయి. చెంబు కడుపు ఖాళీ అయ్యింది. దుప్పటి తడిసి ముద్దయిపోయింది. మారుతి అదేమీ గమనించకుండా గబగబా వంటింట్లోకి వెళ్లాడు. అక్కడ గద్దెపైనున్న పరమాన్నపు గిన్నెను చూచి లొట్టలు వేశాడు. ఆగిన్నెపైనున్న మూతను పైకని కాస్త పరమాన్నమును తీసుకోబోయాడు. మూత కాలింది మారుతికి కాలిన మూతపై కోపం వచ్చింది.

అతడా మూతను దూరంగా విసిరేశాడు. అది వెళ్ళి గాజు గ్లాసును పగులగొట్టి మారుతిని వెక్కిరించింది. అతడు అదేమీ గమనించకుండా గిన్నెలో చేయిదూర్చి వేడివేడి పరమాన్నం తీసుకున్నాడు. చేయి కాలగానే ఆ ముద్దను నోట్లో వేసుకున్నాడు. అంతలోనే రాధమ్మ ఇంట్లో చొరబడింది. "ఏమిటి నాయనా ఆ చప్పుడు?" అంది.

మారుతి నోట్లో వున్న వేడి పరమాన్నపు ముద్దను గుటుక్కున మింగి పళ్ళపై చూపుడు వేళ్లు వేసి పళ్లు తోముకుంటున్నట్టు నటించసాగాడు. వేడి పరమాన్నపు ముద్ద మింగుట వలన కళ్ళపైకి నీరు వచ్చి నిలిచింది.

మారుతి తల్లిని గుడ్లగూబవలె చూస్తూ "అసలు...... అ......అ......అదే...అసలు ఏమయిందంటే మూతను వచ్చి పిల్లి. ఆఁ! కాదు...కాదు......పిల్లి వచ్చి మూతను......" అంటూ నీళ్ళు నమిలాడు.

"వెధవా ఏంటార్రి నువ్వు నాకు చెప్పేది. నువ్వు చెప్పేదంతా అబద్ధమని నేను గ్రహించలేననుకున్నావటార్రి..." అంటూ కొడుకు ముఖంలోకి ఉరిమి చూచింది.

తల్లి తన దొంగ ఎత్తును గ్రహించిందనుకున్నాడు తనయుడు. రాధమ్మ మోముపై విచ్చలవిడిగా విహరిస్తున్న కోపం మారుతి ముఖంపై నాట్యంచేస్తున్న ఆనందాన్ని గాయపరచింది

రాధమ్మ చిన్న కర్ర అందుకొని చవట మారుతిపై ప్రయోగించింది. మారుతి శరీరాన్ని ముద్దు పెట్టుకున్న ముదుసలి కర్ర మూడు ముక్కలయింది.

మారుతి కనుదోయి నుండి కన్నీటి బిందువులు అకస్మాత్తుగా వచ్చి కనుకొలుకుల వద్ద నిలిచాయి. అది చూచి రాధమ్మ మనసు మంచులా కరిగిపోయింది. తక్షణమే మారుతి శరీరాన్ని నిమురుతూ ''నాయనా కొట్టానా...నా చేతులు విరుగ...ఎంతపని చేశానురా.... అయినా నీకింత వయసు వచ్చినా తెలివితక్కువ పనులు చేస్తావాయే. నువ్వు కలెక్టేరువో, తాసిల్దారువో అయితే చూడాలనే కదరా నాయనా నా తాపత్రయమంతాసూ. నేనేమిచేసినా నీకొరకే కాదట్రా. ముఖం కడుక్కోరా.....పరమాన్నం తిందువని చెప్తే తొందరపడి ఇలా చేస్తావట్రా. నీతో చదువు ప్రారంభించినవాళ్ళ కొందరు ఉద్యోగాలు చేస్తున్నారు. కొందరికి వివాహాలు అయ్యాయి. నీకు ఇంత వయసు వచ్చినా ఎనిమిదవ తరగతే చదువుతున్నావాయే. పెళ్ళిపెటాకులు అంతకంటే లేవాయే.......నేనేమి చేసేదిరా నాయనా......'' రాధమ్మ ఇంకా ఏదో అనబోతుండగా మారుతి వెకిలిగా నవ్వాడు.

ఏడ్చి నవ్విన కుమారుని ముఖాన్ని చూడగానే రాధమ్మకు మూర్ఛ వచ్చినంత పనయింది.

" ఓ...ఓ...ఓసి పిచ్చిదానా......నేనేమి పిచ్చివాన్నను కున్నావా? ఎడ్డివాన్ననుకున్నావా?...నాకు ఏమీ తెలియదని నీకేకాదు ఈవూళ్లోని పెద్దవాళ్ళందరికీ తెలుసు. కాని నేను మీరనుకున్నంత తెలివిమాలినవాణ్ణికాదు.....నాకన్నీ తెలుసు.... ఐనో ఎవ్రీథింగ్ .....ముజే తుమ్ మత్ కహో'' అని చెక్కిళ్ళపై జారుతున్న కన్నీటిని తుడుచుకున్నాడు.

తల్లి ముందు వచ్చిరాని ఇంగ్లీషు, హిందీ పదాలను తెలు

గులో కలిపి మాట్లాడడం మారుతికి అలవాటే. ఆ మాటలు రాధమ్మకు అర్థంకావు. అందుకే ఆమె ఎంతో సంతోషపడుతుంది. అప్పుడామె తన కొడుకు కలెక్టరో తహసీలుదారో తప్పని సరిగా అవుతాడని భావిస్తుంది.

మారుతి ముఖం చూస్తూ ఏదో అనుభూతి పొందుతున్న రాధమ్మ తేరుకొని వంటింట్లోకి వెళ్ళింది. గద్దెపైనున్న పరమాన్నపు గిన్నెను అలమారీలో పెట్టి తాళంవేసి మారుతి దగ్గరకు వచ్చి "నేను చుక్కమ్మ ఇంటికి వెళ్ళి బీరకాయలు తీసుక వస్తాను. వచ్చిన వెంటనే నీకు పరమాన్నం పెడతాను. ఇంతలో నువ్వు ముఖం కడుక్కో" అని చెప్పి ఇంట్లో నుండి వెళ్ళిపోయింది.

మారుతి దొంగపిల్లిలా వంటింట్లోకి వచ్చాడు. గద్దెవైపు చూశాడు. అక్కడ పరమాన్నపు గిన్నెలేదు. వంటింట్లో వున్న గూళ్ళన్నీ చూశాడు. పరమాన్నపు గిన్నె ఎక్కడా కనబడలేదు. అలమారీవైపు చూశాడు. దానికి తాళం వేసి వుంది.

అతనికి తాళంపై కోపం వచ్చింది. అటుఇటు చూశాడు. గంపె కనబడింది. దానిని తీసుకొని తాళంపై రెండు దెబ్బలు వేశాడు. అది గట్టి తాళమగుట వలన అతని దెబ్బలకు లొంగలేదు. గంపెను పొయ్యివైపు విసిరేసి ఇంటివెనుకకు వెళ్లాడు.

గద్దె క్రింద పడివున్న దుప్పటిని, చెంబును చూశాడు. వాటిని తన తల్లి చూడలేదని చూస్తే మరో మారు తన వీపు వాయించేదని అనుకున్నాడు. దుప్పటిని పట్టుకొని పైకి లేపాడు. దానికి అక్కడక్కడ మట్టి అంటుకొని వుంది దానిని బావిలో వేసి పైకి తీస్తే దానికున్న మట్టి పోతుందనుకున్నాడు వెంటనే

అతడా దుప్పటిని బావిలో పడేశాడు. తిరిగి దానిని పైకి తీసే ఉద్దేశంతో బొక్కెనను బావిలోకి వదిలాడు. అది వేగంగా వెళ్ళి దుప్పటిని తాకింది. అప్పుడా దుప్పటి పూర్తిగా తడిసిపోయి నీటిలో మునిగిపోయింది. మారుతి బొక్కెనను పైకి చేదాడు. దుప్పటి బొక్కెనకు అంటుకొని పైకి రానందుకు చింతించాడు. దుప్పటి ఏదని తల్లి అడిగితే దొంగ ఎత్తుకపోయాడని చెప్పాలనుకున్నాడు. మళ్ళీ గద్దె దగ్గరకు వచ్చాడు గద్దె క్రింద వున్న చెంబును కడిగి వంటింట్లో బిందె దగ్గర పెట్టాడు. తర్వాత ఊయలపై కూర్చున్నాడు అక్కడికి దగ్గరలోనే పాలతంపి వుంది అతడా పాలతంపిని కొన్ని క్షణాలు చూచి హఠాత్తుగా లేచి దాని దగ్గరకు వెళ్ళాడు. పాలకుండను లేవనెత్తి గ్లాసులో పాలు పోశాడు వెనువెంటనే త్రాగేశాడు "బర్రె పాలు త్రాగితే బలం పెరుగుతుంది'' అని ఓ వస్తాదు వూళ్ళోకి వచ్చినప్పుడు చెప్పిన మాటలు జ్ఞప్తికి వచ్చాయి మారుతికి "బర్రెపాలు త్రాగేస్తాను బలవంతుడనై పోతాను'' అంటూ కూనిరాగాలు తీస్తూ పాలకుండను పైకెత్తి పాలు గ్లాసులో పోయసాగాడు.

చిటుకు మీద కూర్చొంది మారుతి చేస్తున్న పనులన్నీ చూస్తున్న పిల్లి ఒకటి పాలకోసం ఆశపడి "మ్యావ్'' అని అరచింది. అది విని ఉలిక్కి పడాడు మారుతి. అప్పుడు అతని చేతిలోని కుండ భూమి మీద పడి బ్రద్దలయింది. పాలు నేలమీద కాలువలా పారసాగాయి. అతడప్పుడు గడగడ వణుకుతూ బిత్తర చూపులు చూశాడు. చిటుకు మీది నుండి క్రిందికి దూకిన పిల్లిని చూశాడు. "అమ్మ బాబోయ్...'' అంటూ ఇంటి వెనుకకు పరుగు

తీశాడు. పొయ్యి మీదున్న కుండను పైకెత్తి వేడి నీళ్ళను, బట్టలు విడువకుండానే, నెత్తి మీద పోసుకున్నాడు......తర్వాత జ్ఞప్తికి వచ్చిందతనికి. ఇంకా తను ముఖం కడుక్కోలేదని. వెంటనే వెళ్ళి గూట్లో వున్న బొగ్గును నోట్లో వేసుకొని నమిలి చూపుడు వ్రేలితో పళ్ళు తోముకున్నాడు. అప్పుడు కొంత బొగ్గు చెంపలకు అంటింది. నోట్లో నీళ్ళు పోసుకొని పుక్కిలించి ఉమ్మేసిన తర్వాత తడి బట్టల తోనే గద్దె పైకెక్కి సూర్యునికి మరోమారు నమస్కారము చేశాడు. అంతలోనే రాధమ్మ ఇంట్లోకి వచ్చింది.

భూమి మీద పారుతున్న పాలను, పాలు త్రాగుతున్న పిల్లిని, పగిలి పడివున్న పాలకుండ ముక్కలను చూచి ఎడ్చినంత పని చేసిందామె. మార్జాలమే మరకతములాంటి మట్టికుండను పగులగొట్టినదని భావించి కొంగులో వున్న బీరకాయను తీసి పిల్లి పైపు విసిరింది. పిల్లి ఆ దెబ్బను తప్పించుకొని తుర్రున పారి పోయింది. బీరకాయ వేగంగా వెళ్ళి పిట్టగోడ మీదున్న గాజు గ్లాసును పడగొట్టింది. అది నేలను ఢీకొని దశావతారా లెత్తింది. రాధమ్మకు పిల్లి మీద విపరీతంగా కోపం వచ్చింది. అయినా అప్పుడు ఏమీ చేయలేక పోయింది. అదేపిల్లి మరెప్పుడైనా ఇంటికి వస్తే కాళ్ళు విరగగొట్టాలనుకుంది. అయినా వస్తున్న కోపాన్ని ఆపుకో లేక "మారుతీ'' అంటూ కేకవేసింది.

మారుతి రాధమ్మ ముందు ప్రత్యక్షమయ్యాడు. అతని చెంపలకు అంటిన బొగ్గు అలాగే వుంది. తడి బట్టలనుండి నీటి బొట్లు క్రింద రాలిపడుతూనే వున్నాయి. అతని వికార స్వరూపాన్ని చూచి రాధమ్మ చీదరించుకొంది.

"ఏమిటమ్మా పిలిచావు" అన్నాడు మారుతి ముఖం తుడుచుకుంటూ. అలా తుడుచు కోవడం వల్ల చెంపల మీద అక్కడక్కడ అంటివున్న బొగ్గు ముఖమంతా వ్యాపించి అసహ్యంగా తయారయింది. అది చూచి రాధమ్మకు కోపం పొంగులా వచ్చింది. కాని ఎలాగో అణచుకొని "అంతా నాఖర్మ" అని నొసలు కొట్టుకుంది.

'నొసలు కొట్టుకుంటే బొట్టు పోతుందమ్మా" అన్నాడు మారుతి భుజంమీదున్న తడిబట్టను పిండుతూ.

రాధమ్మ సూర్యకాంతంలా ఫోజుపెట్టి సీటి ఏనుగులా నోరు తెరచి బిగ్గరగా అంది "నీ పిండాకూడా.........ఇంట్లోకి ఏనుగు వచ్చినా పట్టించుకునేట్టు లేవు సింహంలా వుంది పిల్లి అంత పెద్ద పిల్లి ఇంట్లోకి వచ్చి పాలకుండను పగులగొట్టినా......"

రాధమ్మ మాటలు పూర్తికాకముందే మారుతి అందుకున్నాడు. "పిల్లి కాళ్ళకు అడుగు భాగాన మాంసపు ముద్దలు వుండుట వలన నడచునప్పుడు చప్పుడు రాదని నీకు తెలియనే తెలియదా ఓష్ మొద్దు"

"నా మతి మండా......అసలు పాలకుండను పిల్లే పగులగొట్టిందనుకున్నాను గానీ పాలతంపి నుండి అది ఇంత దూరం ఎలా వచ్చిందో యోచించనే లేదు. ఇంతపెద్దకుండ ఇంతదూరం ఎలా వచ్చిందిరా? అసలునువ్వే తెచ్చివుంటావు. ఉక్కులాంటి కుండ ఎలా పగిలిందిరా? అసలు నువ్వే పగులగొట్టి వుంటావు. అసలు నీకు జ్ఞానం అనేది వుందా? ఏనుగు లాగ పెరిగావు గానీ ఎలుక పిల్ల కున్నంత జ్ఞానం కూడాలేదు. పిల్లి కాళ్ళకు అడుగు భాగాన మాంసపు ముద్దలుంటాయని ఏ ముండాకొడుకురా నీకు చెప్పింది"

అంది రాధమ్మ వెక్కిరింతగా.

"మా పంతులు ముండాకొడుకు......" అన్నాడు మారుతి వెంటనే నాలుక కొరుక్కున్నాడు. చేతులతో చెంపలు వాయించుకున్నాడు.

"బడికి వేళవుతూవుంది. ఇంకా ఇక్కడే నిలబడి చూస్తావేంటి అయిందేదో అయింది. వెళ్ళి స్నానం చేసి ఏడ్వు"

"స్నానం చేశానమ్మా. వరమాన్నం పెట్టు" అన్నాడు మారుతి లొట్టలు వేస్తూ.

"స్నానం చేశావా? మరి ఆ ముఖం నిండా బొగ్గేమిటి?"

"ఇంకా ముఖం కడుక్కోలేదమ్మా"

"ముఖం కడుక్కోకముందు స్నానం ఎలా చేశావు?"

"ఎలాచేశాను. చేయరాదా ఏమిటి?" అంటూ భుజం పైనున్న తడిబట్టను మరోసారి పిండేశాడు.

"ఓరి వెధవా! స్నానం చేసి ఇంకా బట్టలు కూడా మార్చలేదా?......"

"ఇదిగో క్షణంలో మార్చుకొని వస్తాను. నువ్వు వరమాన్నం వడ్డించు"

రాధమ్మ వంటశాలలోకి వెళ్ళిపోయింది.

మారుతి తడి అంగీని విడుస్తుండగా అది 'పర్రు' మని శబ్దం చేస్తూ చినిగి పోయింది. మారుతి వంటశాల వైపు వెళ్ళి ఆ అంగీని తల్లి పైపు విసిరేశాడు. అదివెళ్ళి ఆమె కాళ్ళ దగ్గరపడింది.

"షర్టు చినిగిపోయింది మసి బట్టకు వాడుకో" అన్నాడు మారుతి.

రాధమ్మ తడి అంగీని చూచి అంది 'ఓరి వెధవా అంగి వుండగానే స్నానం చేశావటా! నేను ఇంత సేపు చూశానుగానీ గ్రహించనే లేదు. అంగి చినిగిందంటే పాతదగుటవలన చినిగిం దనుకుంటున్నాను. 'అదికాదు అసలు విషయం. అంగి తడిగా వుండడం వల్ల విడిచినప్పుడు చినిగిపోయింది. లేక పోతే ఇంకా నెలరోజులన్నా ఆగేదే. వెధవన్నర వెధవ. అంగి వుండగానే స్నానం చేశాడట స్నానం. జ్ఞానం లేని వెధవ''

''జ్ఞానం లేక కాదమ్మా. సినీమాల్లో ఆడవాళ్లు జాకెట్లతోనే స్నానం చేస్తూ కనిపిస్తారు. ఆడవాళ్ళే అలా చేస్తుంటేగా మగ వీరుడనైన నేను చేయకూడదేంటి. అసలు నువ్వు సినీమాలు చూస్తేగా ఈ విషయాలన్నీ తెలియడానికి'

''చీ బుద్ధిలేని వెధవ. నేనొకటంటే నువ్వొకటి వదురుతావు. జ్ఞానం లేని వెధవ ఇంట్లో ఇలా చేస్తావు..... ఇక బళ్లో యేం వెలగబెడతావో నాకు తెలియదు నాయనా.........అయినా నిన్ననేదేమిటి బళ్లోకి వస్తూ జీతాలు తీసుకుంటూ పాఠాలు చెప్పని పంతులు ముండాకొడుకులననాలి. వాళ్ళు ఏ కొద్దిగా చెప్పినా నీకు అంతోఇంతోతెలివి ఒంటబట్టేది''

మారుతి మరేమీ మాట్లాడకుండా అక్కడ నుండి వెళ్ళిపోయాడు. తడి లాగు విడిచేసి పొడిబట్టలు తొడుక్కొని ముఖం పై నీళ్ళు చల్లుకొని తువ్వాలతో తుడుచుకొని వంటింట్లోకి వచ్చాడు. రాధమ్మ పరమాన్నం వడ్డించింది. మారుతి తినసాగాడు.

రాధమ్మ పగిలిపోయిన పాల కుండ పెంకులను పెంటపై పడేసి పాలుపోయిన ప్రాంతములో అలికింది. గ్లాసును కడిగి

దాచింది. తర్వాత మారుతి పడక గదిలోకి వెళ్ళింది. పడక బట్టలు చుడుతుండగా దుప్పటి కనిపించలేదు. వెంటనే మారుతి దగ్గరకు వచ్చి "దుప్పటి ఎక్కడ వేశావురా?" అంది.

తల్లి మాట వినగానే మారుతి గుండెలో రాయిపడినట్లయింది. చేతిలో పట్టుకున్న పరమాన్నపు ముద్దను కంచంలో పడేసి తల్లి ముఖంలోకి బెదిరి బెదిరి చూస్తూ అన్నాడు "నువ్వు చుక్కమ్మ ఇంటికి వెళ్ళిన తర్వాత ఓదొంగ......కాదుకాదు......రాక్షసుడు ......రాక్షసుడు కూడా కాదేమో! అసలు దొంగో రాక్షసుడో నాకు తెలియదు. కాని మన ఇంట్లోకి వచ్చాడు. వాడు దున్నపోతులా వున్నాడు. దున్నపోతుకున్నట్టుగానే వానికి కూడా తలపైన రెండు కొమ్ములున్నాయి......"

"అయితేవాడు దొంగకాదు. రాక్షసుడే. రాక్షసులకే తల పైన కొమ్ములుంటాయి." అంది రాధమ్మ తను రాక్షసులను చూచినట్టు "తర్వాత ఏమయింది?" అంటూ ఆతురత ప్రదర్శించింది.

మారుతి చెప్పసాగాడు. "మరేమో వాడు మన ఇంట్లోకి వచ్చి సరాసరి నేను పడుకునే గదిలోకి వెళ్లాడు......"

"ఆ రాక్షసుడు వచ్చినప్పుడు నువ్వేమి చేస్తున్నావు నాయనా?"

"భారతం చదువుకుంటూ కూర్చున్నాను" అన్నాడు మారుతి కనుబొమ్మలు ఎగురవేస్తూ.

"రాక్షసున్ని చూచినప్పుడు నీకుభయం వేయలేదా నాయనా?" అంది రాధమ్మ. అదోరకంగా ముఖంపెట్టి.

"నాకేం భయం. మరి చెప్తాను విను. వాడు...... అదే

ఆ రాక్షసుడు గదిలోకి వెళ్ళి దుప్పటి పట్టుకొని బయటకు వచ్చాడు. నేను రివ్వున వెళ్ళి వాణ్ని ఢీకొన్నాను. వాని కొమ్ములు విరిచేశాను. వాని కాళ్ళు చేతులు కూడా విరిచేద్దామనుకున్నాను. కాని వాడు అంతలోనే కాలికి బుద్ధి చెప్పాడు. వాడు పారిపోతూ పారిపోతూనే దుప్పటిని బావిలో పడేసి మరీ వెళ్ళాడు. నేను అప్పుడే బావిలో దిగి దుప్పటిని తీద్దామనుకున్నాను. కాని......''

రాధమ్మ ఆనందాన్ని నటిస్తూ ఆశ్చర్యాన్ని ప్రకటిస్తూ అంది '' ఒ......రె......మారుతీ! ఎంత గొప్ప పని చేశావురా. నిజంగా నువ్వు చాలా గొప్పవాడివిరా దేవతలు కూడా రాక్షసులను ఇంత చిన్న వయస్సులో చంపలేదు. నువ్వు దేవతల కంటే కూడా గొప్పవాడివిరా! ఏదీ ఆ రాక్షసుని కొమ్ములను చూపించు"

మారుతి గుడ్లు తేలవేశాడు. వెనువెంటనే కంచంలో చేయి దూర్చి పరమాన్నం తినసాగాడు.

"రాక్షసుని కొమ్ములు చూపిస్తావాలేదా?'' గద్దించి అడిగింది రాధమ్మ.

"అసలు....అసలు రాక్షసుడు మన ఇంటికి రానేలేదమ్మా''

మెల్లగా చెప్పాడు మారుతి.

''రాక్షసుడు రానేలేదా......మరి దుప్పటి ఎక్కడ పారేశావు?''

"బావిలో'' నేలకు ముఖంవేసి చెప్పాడు మారుతి.

"ఓరి వెధవా! బావిలో ఎందుకు వేశావురా! పైగా అబద్ధాలు......వెధవ ప్రగల్భాలు..... వీని ముఖానికి రాక్షసుని కొమ్ములు విరిశాడట...''

"అమ్మా!......అసలు ఏమయిందంటే దుప్పటికి మట్టి అంటింది. దానిని బావిలో వేస్తే మట్టి పోతుందనుకున్నాను. బావిలో వేసిన తర్వాత దాని మట్టి పోయిందో లేదో తెలియదు కాని అది మాత్రం బావిలో మునిగిపోయింది.

"ఓహో......అదా అసలు విషయం. ఈ మాత్రిందానికి ఇన్ని అబద్ధాలెందుకురా ఆడడం. ఇప్పుడు మాత్రిం మునిగిపోయిం దేముంది. బావిలో దిగి ఆ దుప్పటిని తియ్యి."

"నేనా...అమ్మో అందులో కప్పలున్నాయి"

"కప్పలుంటే మాత్రం అవి నిన్నేమీ చేస్తాయిరా?"

"ఏమోనే...కరుస్తాయేమో...అమ్మో నాకు భయం"

"కప్పలకు భయపడడమేమిట్రా! అవి పులులా, సింహాలా భయపడడానికి"

పులల సంగతీ, సింహాల సంగతీ నాకు తెలియదుగానీ.... కప్పలంటే మాత్రిం......అమ్మో నాకు భయం"

"పిరికి వెధవ దుప్పటి ఎవరితోనైనా తీయిస్తాను గానీ నువ్వు బడికి వెళ్ళు"

మారుతి మరేమీ మాట్లాడకుండా బయలుదేరాడు. అప్పుడు పదిగంటల నలభై మూడు నిమిషాల టైమ్ అయింది.

లెక్కలు చెప్పించుకోవడానికి మారుతి పక్కింటి మాస్టారు దగ్గరకు పోనే లేదని మారుతి బడికి వెళ్ళిపోయిన తర్వాత రాధమ్మకు జ్ఞప్తికి వచ్చింది.

మారుతి బడికి చేరుకునే సరికి రెండవ పీరియడ్ నడుస్తూ వుంది. అప్పుడు ఎనిమిదవ తరగతిలో తెలుగు మాస్టారు రామశర్మ

పాఠం చెప్పుతూ వున్నాడు.

మారుతి తరగతి గదిలో ప్రవేశించగానే విద్యార్థులంతా నవ్వారు.

రామశర్మ మాస్టారు విద్యార్థులవైపు కోపంగా చూస్తూ "సైలెన్సు ప్లీజ్" అన్నాడు.

అప్పుడు విద్యార్థులు కొందరు నోళ్ళపైన అరచేతులు పెట్టుకొని మాస్టర్ గారికి శబ్దం విన్పించనంత మెల్లగా నవ్వారు.

"ఏమోయి మారుతీ! లేటుగా రావడానికి కారణమేమిటి?" అన్నాడు మాస్టారు.

"నాకు తెలియదు సార్"

"నీకు తెలియదా?" ఆశ్చర్యపోయాడు మాస్టారు.

"లేటు బడికి రావడానికి రాకపోవడానికి కారణం నాకెలా తెలుస్తుంది సార్"

మాస్టారు కొంచెం ఆలోచించి అడిగాడు "లేటు అంటే నీకేమర్థమయింది?"

"లేటంటే నాకు తెలియదనుకున్నారేంటి. అపర్ణకు మానిటర్ పెట్టిన పేరది. పూర్తి పేరు...లేటుబ్యూటీ"

మానిటర్ టక్కున నిలబడి "లేటుబ్యూటీ కాదోయ్ లైట్ బ్యూటీ" అని చటుక్కున కూర్చున్నాడు. విద్యార్థులంతా గొల్లున నవ్వారు.

"మారుతీ! కూర్చో" అన్నాడు మాస్టారు కోపంతో.

మారుతి కూర్చున్నాడు.

మాస్టారు మానిటర్‌ను మాత్రమే కాకుండా విద్యార్థు

లందరినీ పరిశీలించి అన్నాడు ''విద్యార్థులారా! మీరు ఆడపిల్లలను అవమానం చేయకూడదు. పరాయి ఆడపిల్లలను అవమానం చేస్తే మీకేం లాభం వస్తుంది?''

''లాభం వస్తే అవమానం చెయ్యొచ్చాసార్'' అన్నాడొక విద్యార్థి. ఆమాట ఏ విద్యార్థి అన్నాడో మాస్టారు తెలుసుకోలేక పోయాడు.

''ఎవరది?'' అన్నాడు పెద్ద కంఠముతో.

పిల్లలందరు బుద్ధిమంతుల్లాగా నిశ్శబ్దంగా కూర్చున్నారు.

మాస్టారు మళ్ళీ చెప్పసాగాడు. ''లాభం వున్నా లేకపోయినా ఆడపిల్లలను అవమానం చేయకూడదు అసలు ఆడపిల్లలను మీరెందుకు అవమానం చెయ్యాలి? మిమ్మల్ని ఎవరైనా అవమానిస్తే మీకు బాధకలుగదా? అలాగే ఎవరికయినా బాధకలుగుతుందని భావించి నడచుకోవాలి, అసలు మన భారతదేశంలో ఆడవాళ్ళు నిన్న మొన్నటి వరకు చీకటిలో పుట్టి చీకటిలో పెరిగి చీకటిలోనే మరణించారు...''

''ఆడవాళ్ళు చీకటిలో పుట్టి, చీకటిలో పెరిగి, చీకటిలో చచ్చిపోయారా?'' విద్యార్థులు ఆశ్చర్యపోతూ గుసగుసలాడసాగారు.

మాస్టారు విద్యార్థుల ఆశ్చర్యాన్ని గమనించి మళ్ళీ ఇలా చెప్పసాగాడు. ''చీకటి అంటే ఇక్కడ అజ్ఞానం అని అర్థం. స్త్రీలు అజ్ఞానంతో వుంటే దేశము బాగుపడదని యెంచి మన సంఘ సంస్కర్తలు కొందరు స్త్రీలను వెలుగులోకి తీసుకరావడానికి ప్రయత్నించారు. అంటే స్త్రీలను విద్యావంతులను చేయడానికి ప్రయత్నించారు. వాళ్ళ కృషి ఫలితంగా స్త్రీలు అన్ని రంగాలలో

ప్రవేశించి పనులు చేస్తున్నారు. ప్రగతి సాధిస్తున్నారు. పూర్వ కాలంలో స్త్రీలు ఇల్లుదాటి బయటకు వచ్చేవాళ్ళుకాదు. చదువుకునే వాళ్ళుకాదు. ఉద్యోగాలు చేసేవాళ్ళుకాదు. వాళ్ళ స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు లేక చదువు సంధ్యలు లేక ఎంత హీనస్థితిలో వుండేవాళ్ళో మీరే ఆలోచించండి. నేటి స్త్రీలు విద్యనభ్యసించి అన్నిరంగాలలో పని చేస్తున్నారు. కాని పురుషులలో ఉన్నంత మంది విద్యావంతులు ఇప్పటికీ స్త్రీలలో లేరు. ఇప్పటికీ స్త్రీ విద్యను ప్రోత్సహించ వలసిన ఆవశ్యకత ఎంతయినా వుంది విద్యావంతురాలైన స్త్రీ తన బిడ్డలను తెలివికలవారిగా తయారు చేస్తుంది. అప్పుడే దేశం బాగుపడుతుంది. చదువుకునే అమ్మాయిలను మీరు ప్రోత్సహించాలి. అంతే కాని హేళన చేయకూడదు. వాళ్ళకు మారుపేర్లు పెట్టి అవమానం చేయకూడదు''

మాస్టారు చెప్పడం ఆపేశాడు. విద్యార్థులు ఇంకా ఏదో గుసగుసలాడుతూనే వున్నారు. వాళ్ళు అలా గుసగుసలాడుతూ చిలిపిగా మాట్లాడుతూ అల్లరిచేసినప్పుడు అతడు నల్లబల్లమీద కఠినమైన వాక్యాలు వ్రాయిస్తాడు. అలా చేయడం వలన విద్యార్థులు నిశ్శబ్దంగా వుంటారని అతని అభిప్రాయం అనుభవం కూడా.

అతడు నల్లబల్లమీద విద్యార్థులచేత వాక్యాలు వ్రాయించ సాగాడు మారుతి వంతు వచ్చింది. అతని వంతు వచ్చినప్పుడు ఎప్పుడైనా మాస్టారు చాలా సులభమైన వాక్యాలు చెప్తాడు చదువుల్లో మారుతి స్థాయి అతనికి బాగా తెలుసు. అతడు ''గుర్రము గడ్డి తినును'' అని చెప్పాడు.

మారుతి నల్లబల్లమీద ''గొర్రె గుడ్డు తినును'' అని

వ్రాశాడు.

మాస్టారు మారుతిని ఆ వాక్యమును చదువుమన్నాడు.

మారుతి "గుర్రము గొర్రెను తినును" అని చదివాడు.

అంతవరకు నవ్వాపుకుంటున్న విద్యార్థులు ఫక్కున నవ్వేశారు. మాస్టారు కూడా నవ్వకుండా ఉండలేకపోయాడు. తదుపరి అతడు మారుతిని "నక్షత్రములు" అనే పాఠం చదువుమన్నాడు.

మారుతి పుస్తకం తెరచి "నక్షత్రకుడు" అనే పాఠం చదువబోయాడు.

మాస్టారు పుస్తకములో పేజీ నెంబర్ చెప్పి మరోమారు "నక్షత్రములు" అని పాఠం పేరు చెప్పాడు.

మారుతి చదువసాగాడు.

"చీకటి రాతులందు మేకలు లేవి ఆకాశమును తినిన మనకు లెక్క లేనన్ని కుక్కలు పుట్టును.

అతడు పాఠం తప్పులతో చదివినందుకు విద్యార్థులంతా కడుపుబ్బ నవ్వారు.

మారుతి చదివిన అంశం పుస్తకములో ఈ విధంగా వుంది.

"చీకటి రాత్రిలందు మేఘములు లేని ఆకాశమును తిలకించిన మనకు లెక్కలేనన్ని చుక్కలు ప్రకాశించుచు కనబడును"

మాస్టారు మారుతి ముఖంలోకి చూస్తూ ఏదో అనబోయాడు. అంతలోనే గంట మ్రోగడం వల్ల మౌనంగా క్లాసు రూము నుండి వెళ్ళిపోయాడు.

# 2

"మారుతీ!"

తల్లి పిలుపు వినబడగానే గబగబా వచ్చి ఆమె ముందు నిలబడ్డాడు మారుతి.

"గతమాసం లెక్కల పరీక్షలో నీకెన్ని మార్కులు వచ్చాయో జ్ఞాపకముందా?" అడిగిందామె.

అతడు జ్ఞాపకం లేదన్నట్టు తలవూపాడు.

"మార్కులు వస్తేగా జ్ఞాపకముండడానికి. నాకు జ్ఞాపకముందిరా నీకా నెలలో బాతు గుడ్డు వచ్చింది"

మారుతి నేలకు ముఖం వేశాడు.

"నేల చూపులు చూస్తావెందుకురా? పోయిన పరీక్షలు ఎలాగూ పోయాయి. ఈ నెలలోనైనా లెక్కల పరీక్షలో కొంగ గుడ్డో, కోడిగుడ్డో, బాతుగుడ్డో కాకుండా చాలా మార్కులు తెచ్చుకోవాలి నువ్వు"

తెచ్చుకుంటానన్నటు తలవూపాడు

"ఎనిమిదవ తరగతి చదువుతున్న నీకు నాల్గవ తరగతి లెక్కలు కూడా సరిగా రావాయే. అలాంటప్పుడు మార్కులు ఎలా వస్తాయి? ఎలా పాసవుతావు? "

"కష్టపడి లెక్కలు తీస్తాను. మార్కులు సంపాదిస్తాను. పాసవుతాను. నాగురించి నువ్వు బెంగపెట్టుకోకమ్మా" అన్నాడు మారుతి కష్టజీవిలా ఫోజుపెట్టి

"ఏం కష్టపడుతావో ఏం పాసవుతావో నాకు తెలియదు

నాయనా! అయినా ఈ రోజుల్లో అందరూ పదవే పాసవుతున్నారా: పదవి మార్కులు సంపాదించడమనేది చాలా పాతపద్ధతి. కొత్త పద్ధతి ఏమిటంటే పేపర్లో జవాబులు సరిగా వ్రాయకపోయినా టీచర్ ఎక్కువ మార్కులు వేయాలి''

"ఎలా వేస్తాడమ్మా?''

'వేయడు నిజమే! కాని మనం వేయించుకోవాలి''

'ఆ టీచర్ మనం చెప్పినట్టు వినడమ్మా''

"లంచానికి లొంగని వాడెవ్వడురా ఈ లోకంలో''

"లంచమా! ఏం లంచం ఇద్దామే మనం''

పాలు, పెరుగు ఉచితంగా పోస్తే ఆ టీచర్ మనం చెప్పి నట్టు వింటాడన్న నమ్మకం నాకుంది''

"నాకా నమ్మకం లేదమ్మా''

"నీ నమ్మకానికెవడురా విలువ ఇచ్చేది. నేను చెప్పినట్టు విను'' అని చెప్పి గబగబా వంటింట్లోకి వెళ్ళి ఒకగ్లాసులో పాలు మరో గ్లాసులో పెరుగుపోసి తెచ్చి మారుతికి ఇచ్చింది.

మారుతి అదోరకంగా ముఖంపెట్టి అన్నాడు "అయితే నేను పాసవుతానా అమ్మా''

'ఉష్ బిగ్గరగా మాట్లాడకు'' అని కొడుకు నోరు మూసిం దామె. గోడలకు చెవులుంటాయని రాధమ్మకు తెలుసు గనుక మెల్లగా ఇలా అంది "పంతులుకు పాలు పెరుగు ముట్టాక పాసు కాకపోవడమేమిట్రా నా పిచ్చితండ్రి క్లాసులో ఫస్టు వస్తావు''

మారుతి ఏదో ఆలోచిస్తూ గ్లాసులకేసి చూడసాగాడు.

రాధమ్మ కొడుకు ముఖాన్ని పరిశీలనగా చూస్తూ అంది

..నాయనా మారుతీ ఈ చచ్చిపోయిన చదువు చదువుటవలన చాలా చిక్కిపోయావురా. పంతులుకు పాలుపెరుగు ఇచ్చి వచ్చి విశ్రాంతి తీసుకో. ఎక్కువగా చదివితే పిచ్చెక్కుతుందట. మన పుల్లాయమ్మ కొడుకు లేడూ. అదే రఘుగాడు వాడు ఏడవ తరగతి రెండవసారి చదివి ఫస్టు క్లాసులో ఫేలై పిచ్చెక్కి ఎక్కడికో పారిపోయాడు. నీ చదువు రఘుగాని చదువుకంటే పెద్దదాయే ఎనిమిదవ తరగతి రెండవ సంవత్సరం చదవడమంటే మాటాలా మరి"

తల్లి మాటలు మహా శ్రద్ధగా వింటున్న మారుతి రాజనా సురనిలా నవ్వి మారుతిలా అంగలు వేసుకుంటూ పక్కింటి మాస్టారు దగ్గరకు వెళ్లాడు. అప్పుడు మాస్టారు కుర్చీలో కూర్చుండి ఏదో పుస్తకం చదువుకుంటున్నాడు.

"మాస్టర్‌గారూ!" మారుతి పిలిచాడు.

మాస్టారు మారుతివైపు చూశాడు. అతని చేతుల్లో వున్న గ్లాసులను చూశాడు. ఆశ్చర్యపోయాడు.

"ఏమిటి మారుతీ?" అన్నాడతడు మెల్లగా.

"పాలు, పెరుగు మీకు ఇచ్చిరమ్మంది అమ్మ" చెప్పాడు మారుతి.

పిల్లికి పిడచ వేయని పిసినారి రాధమ్మ తనకు ఉచితంగా పాలు, పెరుగు పంపడమేమిటి? మాస్టారు ఆలోచనలో పడిపోయాడు.

అతడు రాధమ్మ ఇంటిప్రక్క ఇంట్లోకి వచ్చాక ఒక గొల్లామె పాలు తెచ్చి పోసేది. ఆమె ఒక నియమిత సమయానికి పాలు తెచ్చేదికాదు. అందువల్ల అతడు రాధమ్మ వద్ద పాలవాడకం

పెట్టుకున్నాడు. ఒక పర్యాయం అతని వద్ద డబ్బు లేకపోవడం వల్ల సమయానికి ఇవ్వలేకపోయాడు. అప్పుడామె మాస్టారు మీద కోపాన్ని ప్రదర్శించింది. ఆ తర్వాత పాలు పోయడమే మానేసింది.

మారుతి మళ్ళీ అన్నాడు "ఇ...ఇ...ఇదిగోండి మాస్టారు మ...మ...మా అమ్మ మీకీ పాలు పెరుగు ఇచ్చిరమ్మంది"

లౌక్యాన్ని ప్రదర్శించే వారి ముందు లౌక్యాన్ని ప్రదర్శిస్తేనే బాగుంటుందని మాస్టారుకు తెలుసు. అందుకే అతడు మారుతిని జాలిగా చూస్తూ "మైడియర్ మారుతీ! ఈ పాలు పెరుగు నువ్వే తాగి అలా చేసినట్టయితే నువ్వు రేపు వ్రాసే లెక్కల పేపర్లో ఫస్టు మార్కులు సంపాదిస్తావు" అన్నాడు

మారుతి వెనువెంటనే రెండు గ్లాసుల్లోని పాలు, పెరుగు నాలుగు గుటకల్లో మ్రింగేసి అపర భీమునిలా ఫోజుపెట్టాడు.

మాస్టారు మారుతి ముఖంలోకి చూస్తూ "భేష్ ఇక వెళ్ళు ఈ నెలలో అయిన లెక్కలన్నీ మొదటి నుండి చివరివరకు తప్పులు పోకుండా తీస్తే తప్పని సరిగా ఫస్టు క్లాసులో పాసవుతావు" అన్నాడు.

అది వినగానే మారుతి ముఖం దెబ్బతిన్న కుక్క ముఖంలా తయారయింది.

"వెళ్ళు మారుతీ! వెళ్ళి లెక్కలు తియ్యి" అన్నాడు మాస్టారు బుజ్జగిస్తున్నట్టు.

మారుతి గిరుక్కున వెనక్కు తిరిగి ఏనుగులా అడుగులు వేస్తూ ముందుకు కదిలిపోయాడు.

అంతవరకు మూసివున్న కిటికీ తలుపుల సందుల్లో నుండి

చూస్తున్న రాధమ్మ తన ఉపాయం ఫెయిలైనందుకు బాధపడింది. మారుతి ఇంట్లోకి రాగానే అటుకులు పెట్టి బుక్కమని చెప్పి మాస్టారు దగ్గరకు వచ్చేసింది.

"మాస్టరుగారూ! మీరు కొంచెం కనికరించాలి. మేమూ పెద్ద ధనవంతులం కాదు. మీకు పెద్ద పెట్టున బహుమతి ఇచ్చుకునే శక్తి మావద్ద లేదు. తృణమో పణమో ఇస్తే అదే గొప్పగా భావించాలి" అందామె.

ఆ మాటలు మాస్టారుకు చాలా బాధ కలిగించాయి. కాని ఎలాగో అణుచుకున్నాడు. అటుపై వెంటనే అన్నాడు "మీరనేదేమిటో నాకర్థం కావడం లేదండీ"

"అర్థం కావడంలేదా? అయితే వివరంగా చెప్తాను వినండి. మాది మధ్య తరగతి కుటుంబం. మా ఆయనకు వ్యవసాయం చేయరాదు. చాందాలో అర్చకుడుగా వుంటున్నాడు. పాలేర్లతోనే వ్యవసాయం నడుస్తూవుంటుంది. పంటలు తక్కువ. ఇంటి ఖర్చులు ఎక్కువ. దీనికి తోడు ఓసారి మా ఇంట్లో దొంగలు పడి వున్న బంగారంలో సగానికి పైగా ఎత్తుకపోయారు దురదృష్టవంతులకు అన్నీ కష్టాలే అన్నట్టు పుట్టిన పిల్లల్లో చాలా మంది చచ్చిపోయారు. పదహారేళ్ళ కొడుకును పోగొట్టుకున్న నష్టజాతకురాల్ని. నాలుగు కడుపులు పోయాయి. చిన్నతనంలోనే ఇద్దరమ్మాయిలు, ముగ్గురబ్బాయిలు నన్ను దుఃఖములో ముంచిపోయారు. చివరికి ఆ మారుతిగాడు, లలితదక్కారు...మీరు చూడలేదనుకుంటాను. మీరు మరో రెండు రోజులకు మా పక్కింటికి వస్తారనగా అది మా తమ్ముని ఇంటికి వెళ్ళింది. నిన్నగాక మొన్న ఇక్కడికి వచ్చి మళ్ళీ

నిన్ననే స్నేహితురాండ్రతో కలసి వేములవాడకు వెళ్ళింది......
మా లలిత అందం అప్సరస అందానికి ఏ మాత్రం తీసిపోదు.
కాని బ్రహ్మదేవుడు దానిని భూలోకానికి పంపేముందు అదృష్టం వ్రాయడం మరచిపోయినట్టున్నాడు. కేవలం కష్టాలనే వ్రాసి పంపినట్టున్నాడు.......దానికి యుక్తవయసు రాగానే ధనవంతుడు విద్యావంతుడు అయిన అందమైన అబ్బాయికిచ్చి పెళ్ళిచేశాం. పెళ్ళి చేసిన మూడు సంవత్సరాలకే అది ముండమోసింది...మా బ్రాహ్మణుల ఆచారాలు ఈనాటికి కూడా చాలా కఠినంగానే వున్నాయి. మా కులంలో పెళ్ళయిన మరుక్షణమే భర్త చనిపోయినా ఆ స్త్రీ విధవగానే వుండాలి. ఎవరైనా ఈ ఆచారానికి భిన్నంగా నడిస్తే వారిని చులకనగా చూస్తారు......ఇక మా లలిత విషయం అది ప్రతిదినం రెండుసార్లు చన్నీటితో స్నానం చేస్తుంది. ఆసనాలు వేస్తుంది. మితంగా భోజనం చేస్తుంది. ఏవో పుస్తకాలు చదువుకుంటూ కాలాన్ని గడిపేస్తుంది. దాని గతి అలా అయింది. ఇక వీడైనా చదువుకొని బాగుపడుతాడేమో అనుకుంటే వీని అదృష్టం కూడాబాగున్నట్టులేదు. కానిఒక విచిత్రమైన విషయంచెప్తాను వినండి. లలితకు మనం అదృష్టం కల్పించలేక పోవచ్చు, కల్పించలేం కూడా. కాని మారుతి విషయం మాత్రం అలాకాదు. వానికి దేవుడు అదృష్టం ఇవ్వకపోయినా ఇప్పుడు మనం విధాతకు విరుద్ధంగా అదృష్టం కల్పించ వచ్చు. వానికి పరీక్షలో సున్న మార్కులు వచ్చినా పాసు మార్కులు వేసి పాసు చేయవచ్చు. వానికి అలాంటి అదృష్టాన్ని కల్పించే శక్తి కేవలం మీ ఒక్కరిలోనే వుంది. మీరు దైవాంశ సంభూతులు......"

"పొగడ్తలెందుకులెండి" అన్నాడు మస్టారు కొంచెం అయిష్టంగా.

రాధమ్మ అదేమీ పట్టించుకోకుండా చెప్పసాగింది.. ...

"వాడు చిన్ననాటి నుండి ఇనాటివరకు ఎన్నో గండాల నుండి గట్టెక్కాడు. చిన్ననాడు చాలాసార్లు మూర్ఛపోయేవాడు. వచ్చినంత పని చేసేవాడు. వాణ్ణి ఎన్నో ఆసుపత్రులు త్రిప్పాము. ఎన్నో రకాల మందులు తినిపించాం కాని ఏ మందు కూడా వాని శరీరం మీద పని చేయలేదు......"

"మీరు నిలబడే మాట్లాడుతున్నారు. ఇలా వచ్చి కుర్చీలో కూర్చోండి" అన్నాడు మాస్టారు హఠాత్తుగా.

రాధమ్మ నవ్వు ముఖంతో అంది "మీరు నాకన్నా వయస్సులో చిన్నవారే అయినా ఉపాధ్యాయులు గనుక పూజనీయులు. మీ నాలుక మీద సరస్వతీదేవి వుంది. మీ చేతిలో లక్ష్మీదేవి వుంటుంది. మీలాంటి గొప్పవారి ఆదరణకు అర్హురాలను అయినా కాకపోయినా మీరు కూర్చుండ మంటున్నారు గనుక కూర్చుంటాను "అని చెప్పి కుర్చీలో కూర్చుంది. తర్వాత మాస్టారు ముఖంలోకి చూస్తూ "ఎంతవరకు చెప్పాను?" అంది.

"మీ.. మారుతి శరీరం మీద ఏ మందులూ పనిచేయలేదు"

"ఆ తర్వాత చెప్తాను వినండి.....చివరికి మారుతిని పెద్దపెల్లిలో వున్న నాటు వైద్యుని వద్దకు తీసుకవెళ్లాం. అక్కడి వైద్యుడు మన అబ్బాయిని పరీక్షచేసి ఓ తాయత్తు కట్టాడు. అంతే కాకుండా మన ఇంటికి వచ్చి దూలానికి ఓ రేకు యంత్రం కూడా కొట్టాడు......"

"రేకు యంత్రాన్ని దూలానికి కొట్టడం యెందుకు?" మాస్టారు హఠాత్తుగా అడిగాడు

"అలా కొడితే ఇంట్లోకి దుష్టశక్తులు రావట. ఒకవేళ ఇంట్లోనే వుంటే పారిపోతాయట కూడా.......ఆయన దయవల్ల మారుతి హాయిగా వుంటున్నాడు. మీరు ఆ రేకు యంత్రాణ్ని చూద్దురుగాని రండి" అంటూ మాస్టారును ఆహ్వానించింది.

మాస్టారు ఆమె ఆహ్వానాన్ని కాదనలేక ఆమె వెంట వెళ్ళాడు.

చాపలో కూర్చుండి ఏదో వ్రాసుకుంటున్న యువతిని చూస్తూ అంది రాధమ్మ "ఎప్పుడు వచ్చారే"

"ఇప్పుడే" అందామె.

రాధమ్మ మాస్టారు వైపు తిరిగి అంది "ఇదేనండి నా కూతురు. పెళ్ళయిన కొన్నాళ్ళకే పసుపు కుంకుమలకు దూరమైన దురదృష్టవంతురాలు"

మాస్టారు లలిత ముఖంలోకి చూశాడు. ఆమె అతనికి చేతులెత్తి నమస్కరించింది.

రాధమ్మ మాస్టారుకు రేకు యంత్రాన్ని చూపెడుతుండగా లలిత కలం, కాగిదాలు పట్టుకొని గదిలోకి వెళ్ళిపోయింది,

"పుణ్యాత్ముడు ఎక్కడ వున్నాడో కాని రోజుకు ఒక్కసారైనా జ్ఞప్తికి వస్తాడు. ఆయన దయవల్ల మారుతిగాడు ఓ మనిషిలా బ్రతుకుతున్నాడు. ఇక మీరు కూడా దయతలచి వాణ్ని పాసుచేస్తే మీపేరు కూడా కలకాలం జ్ఞప్తికి వుంచుకుంటాం....నామతిమండ ఇంతసేపు మిమ్మల్ని కూర్చుండుమని అననేలేదు. ఇలా వచ్చి

ఈ కుర్చీలో కూర్చోండి. కాఫీ చేసి తెస్తాను'' అని చెప్పి గబ గబా వంటింట్లోకి వెళ్ళిపోయిందామె.

మాస్టారు కుర్చీలో కూర్చున్నాడు.

మారుతి పెద్దపీట మీద కూర్చుండి వున్నాడు. అతడు మాస్టారును చూడగానే లెక్కలు తీస్తున్నట్లు నటించసాగాడు.

"మారుతీ! నీ ప్రోగ్రెస్ కార్డు ఒక్కసారి చూపిస్తావా?'' అన్నారాయన.

మారుతి తెచ్చి ఇచ్చాడు.

అది గత సంవత్సరపు ప్రోగ్రెస్‌కార్డు. తెలుగులో సరాసరి మార్కులు మూడున్నర, హిందీలో సరాసరి మార్కులు అర, ఇంగ్లీషులో సరాసరి మార్కులు అరసున్న, సైన్సులో సరాసరి మార్కులు సున్న, సాంఘిక శాస్త్రములో సరాసరి మార్కులు రెండున్నర, లెక్కల్లో సరాసరి మార్కులు సున్నసర వున్నాయి. మాస్టారు ఆ ప్రోగ్రెస్‌కార్డు మారుతికి ఇచ్చేస్తూ అన్నాడు "ఇది పోయిన సంవత్సరపు ప్రోగ్రెస్‌కార్డు. ఈ సంవత్సరపు ప్రోగ్రెస్ కార్డు చూపించు''

మారుతి మరో ప్రోగ్రెస్‌కార్డు తెచ్చిఇచ్చాడు. మాస్టారు దానిని చూడసాగాడు.

తెలుగులో ఫేలైయినాడు, హిందీలో సున్నసర మార్కులు వచ్చాయి. ఇంగ్లీషులో బండి చః౧ం వచ్చింది. సైన్సులో మహా గొప్పగా ఫేలైనాడు, సాంఘిక శాస్త్రములో గొప్పగా ఫేలైనాడు. లెక్కల్లో అర్ధ మార్కు వచ్చింది. మారుతి తెలివి ఎంత గొప్పదో మాస్టారుకు పూర్తిగా అర్థమైపోయింది.

"మారుతీ! నీకు పోయిన నెలలో ఏ సబ్జెక్టులో కూడా మంచి మార్కులు రాలేదు. ఈనెలలోనైనా మంచి మార్కులు సంపాదించుకో. మంచి మార్కులు పొందాలంటే కష్టపడి చదవాలి' అన్నాడు.

కంచు విగ్రహంలా నిలబడివున్న మారుతి మాస్టారు అందించిన ప్రోగ్రెస్‌కార్డు అందుకొని పిల్లిలా పారిపోయాడు.

"లలితా! మాస్టర్ గారికి వేములవాడ రాజేశ్వరస్వామి ఫలహారం పెట్టవే'' అంటూ కేకేసింది రాధమ్మ వంటింట్లో నుండి

లలిత ఫలహారం పెడుతుండగా ఆమెను పరిశీలించి చూశాడు మాస్టారు.

ఆమె ముఖం అందంగా వున్నా దీనంగా వుంది, జాలికొలిపే విధంగా వుంది. శరీరం చిక్కిపోయివుంది, బలహీనంగా వుంది.

పతి చనిపోయిన పడతిగతి ఎంత అధ్వాన్నంగా వుంటుందో ఇన్నాళ్లూ అతడు ఆలోచించలేదు. కాని లలితను చూశాక ఆలోచించకుండా వుండలేకపోయాడు. ఆయన మనస్సులో అనేక ఆలోచనలు చెలరేగాయి, అనేక ప్రశ్నలు ఉదయించాయి. ఆయనకు ఈ సమాజంలోవున్న ఆచార వ్యవహారాలపై ఎక్కడలేని కోపం వచ్చింది.

భర్త చనిపోయిన స్త్రీ బొట్టు, పూలు, గాజులు మొదలగున వస్తువు ధరించకూడదని ఎందుకు శాసించింది సమాజం? భార్య చనిపోయిన పురుషుడు మరో వివాహం చేసుకోవడానికి అంగీకరిస్తున్న సమాజం భర్త చనిపోయిన స్త్రీ మరో వివాహం చేసుకోవడానికి ఎందుకు అంగీకరించడం లేదు?......

రాధమ్మ కాఫీ కప్పు తెచ్చి మాస్టారుకు అందివ్వడంతో అతని ఆలోచనలకు అంతరాయం కలిగింది. అతడు ఓ గ్రుక్కెడు కాఫీ మ్రింగి అన్నాడు "అమ్మా! మీ అమ్మాయికి మళ్ళీ పెళ్ళి చేయలేక పోయారా?''

రాధమ్మ వినగూడని మాట విన్నట్లు చెవులు మూసుకుంది. "తప్పు మాస్టారూ. మగవాడు ఎన్ని వివాహాలయినా చేసుకోవచ్చు కాని ఆడదానికి ఒకేసారి పెళ్ళి......'' ఆ తర్వాత ఆమె చెప్ప లేకపోయింది.

"పెళ్ళిమాట పోనీయండి. పెళ్ళినాడే భర్తతోనపాటు స్త్రీకి మాంగళ్యం వస్తుంది. జీవితం మధ్యలో వచ్చిన భర్త చనిపోతే అతడు కట్టిన మాంగల్యం తీసివేస్తే సరిపోతుంది. అంతేకాని పూలు, బొట్టు, గాజులు మొదలగునవన్నీ ఆమెకు దూరంచేయడం అన్యాయం కాదా? ఒక్కపూట భోజనం చేయాలని, నేలమీదే పడు కోవాలని ఇలా ఎన్నో విధాలుగా బాధించడం అన్యాయం కాదా? ఆమె ఇష్టాయిష్టాలను ఆమె నిర్ణయించుకోవాలి గానీ ఇతరులు ఆమెను నిర్బంధించడం అన్యాయం కాదా?......''

"కాదు మాస్టారూకాదు...అది ఆచారం, సాంప్రదాయం, కట్టుబాటు భర్తచనిపోయిన స్త్రీ అలంకారాలు వదులుకుంటే చని పోయిన ఆ భర్తకు స్వర్గం లభిస్తుంది. బ్రతికి వున్న ఆ విధవకు పుణ్యం దక్కుతుంది''

రాధమ్మ చదువులేమివల్ల ఎంత అజ్ఞానంలో వుందో...... సంకుచితమైన ఆచారాలను ఎంత గౌరవిస్తూవుందో..... మాస్టారు కొంచెంసేపు ఆలోచించాడు.

కాఫీత్రాగడం పూర్తికాగానే కప్‌సాసర్లు రాధమ్మకు అందించాడు. ఆమె వేరే సందర్భములో అయితే "అయ్యో మాస్టారూ! కప్‌సాసర్లు కడిగివ్వండి. మీరు త్రాగిన ఎంగిలి కప్ సాసర్లను మేము కడుగుతామా! మేము బ్రాహ్మణులమైతిమి. మేము మీకంటే గొప్పకులం వాళ్ళమైతిమి'' అనేది కాని మాస్టారు చేత ఎక్కువ మార్కులు వేయించుకునే ఉద్దేశముతో వున్న ఆమె ఏమీ అనలేకపోయింది. కప్‌సాసర్లు పట్టుకొని వంటింట్లోకి వెళ్ళిపోయింది.

మాస్టారు వితంతువులను గురించి ఆలోచించసాగాడు.

వీరేశలింగం పంతులు వితంతు వివాహాలు చేయడానికి పూనుకున్నప్పుడు ఆయనను ఎందరో వ్యతిరేకించారు. ఆయన ఎన్నో కష్టనష్టాలకోర్చి వితంతు వివాహాలుచేసి స్త్రీలకు కొంత వరకు -న్యాయాన్ని చేకూర్చగలిగాడు. ఆయన తర్వాత ఎన్నో సంవత్సరాలు గడచిపోయినా ఆయన ఆశించినంతగా మార్పురాలేదు. ఈనాటి వితంతువులు కూడా ఎన్నో బాధలు అనుభవిస్తూనేవున్నారు.

"రాధా!'' అంటూ పిలుస్తూ బ్రాహ్మణ ముసలి వింతంతువు ఒకావిడ బోడిగుండుపై కొంగు కప్పుకొని వచ్చింది.

రాధమ్మ "రండి పెద్దమ్మా!'' అంటూ ఆహ్వానించింది.

ఆమెవచ్చి అరుగు అంచుకు కూర్చుంది.

"మాస్టర్‌గారు ఏమంటున్నారో తెలుసా పెద్దమ్మా''

"ఏమంటున్నారే?''

"లలితకు మళ్ళీపెళ్ళిచేస్తే బాగుంటుందంటున్నారు''

"ఏమో మరి కాలం మారుతూవుంది. మా కాలములో

మగడు చనిపోయిన వెంటనే భార్య తలవెంట్రుకలు తీసివేసేవాళ్లు రవిక తొడుక్కుంటే తప్పుపట్టేవాళ్ళు. ఈ రోజుల్లో భర్త చనిపోతే భార్య తలవెంట్రుకలు తీయించివేస్తున్నారా? జాకెట్లు కూడా తొడుక్కుంటున్నారు కదే. అలాగే మళ్ళీ పెళ్ళి చేసుకుంటే మాత్రం తప్పేమిటి?"

"పెద్దమ్మా! నువ్వేనా ఈ మాటలు మాట్లాడేది. పాతికేళ్లు నిండకముందే భర్త చనిపోతే తలవెంట్రుకలు తీసేయించుకున్నదానవు. రవిక తొడుక్కోవడం మరచిపోయినదానవు బొట్టుకు, పూలకు, గాజులకు దూరంగా వున్నదానవు రోజుకు ఒక్కసారి మాడ్చిసే పిడికెడు మెతుకులు తిని బ్రతికినదానవు. కటిక నేలమీద పడుకుంటునదానవు. జీవితంలో సగం కన్న ఎక్కువభాగం దుఃఖంతో గడిపినదానవు అలాంటి నువ్వు......నువ్వు......నువ్వు ఇలా మాట్లాడుతున్నావేమిటి?"

"నా అనుభవంతో నేను తెలుసుకున్నదేమిటంటే మగడు చనిపోయిన ఆడవాళ్ళు నిజంగానే భయంకరమైన బాధలు అనుభవిస్తారు ఈ బాధల నుండి తప్పించుకోవాలంటే మళ్ళీపెళ్ళి చేసుకోవడం కంటే ఉత్తమమైన మార్గం మరొకటిలేదు"

రాధమ్మ విస్తుపోయి అంది "పెద్దమ్మా!"

"నిజంగానే చెప్తున్నానే రాధా! ఏదైనా అనుభవిస్తే అది మంచో చెడో తెలుస్తుంది. 54 సంవత్సరాల క్రితం నా మగడు చనిపోగానే ఆయన పేరిట నేను వితంతువుగానే వుండిపోయాను. అదే నేను చనిపోయివుంటే నా పేరిట ఆయన మళ్ళీ పెళ్ళి చేసుకోకుండా నాలాగే బాధలు అనుభవిస్తూవుండేవాడా? మగవానికోనీతి,

ఆడదానికో నీతి వున్న ఏ సమాజంలోనైనా ఆడది బాధలే అనుభ విస్తుంది. సమాజపు ఆచారాలను ధిక్కరించి నేను మరో పెళ్ళి చేసుకొని వుంటే సుఖించేదాణ్ని. ఈ సమాజంలోని ఈ దురాచారా లను గౌరవించడం వల్ల నాకు ఒరిగిందేమిటి? నిత్యమూ కన్నీళ్ళు, భయంకరమైన బాధలు'

"పెద్దమ్మా! మీ ఆయన చనిపోయిన తర్వాత మళ్ళీ పెళ్ళి చేసుకోవాలన్న ఆలోచన నీకెప్పుడైనా వచ్చిందా?"

ఆ ముసలి వితంతువు దీర్ఘంగా నిట్టూర్పు విడిచింది.

"రాధా" అని ఏదో చెప్పబోయింది. గొంతు వణికింది. కన్నులు చెమర్చాయి.

చెప్పు పెద్దమ్మా"

"వయస్సులో కోరికలుండడం సహజం రాధా! ఒక్క పూటే భోజనం చేసినా పురుష స్పర్శ కావాలన్న కోరిక ఎప్పుడో ఒకప్పుడు కలుగుతూనే వుండేది. సిగ్గు విడిచి చెప్తున్నందుకు ఏమీ అనుకోకే రాధా"

"పెద్దమ్మా! ఇప్పుడు నువ్వు రవికతొడుక్కున్నా తలవెంట్రు కలు పెంచుకున్నా ఎవరూ ఏమీ అనరుకదా. మరి అలా చేయ వెందుకు?"

"పిచ్చిరాధా! ఇప్పుడు నేను రవికతొడుక్కున్నా, తలవెంట్రు కలు పెంచుకున్నా నాకు లభించే సుఖమేమిటే. మగడు చనిపోయిన ఆడదానికి ఇవన్నీ ఉండవద్దని ఎందుకన్నారో, అలా అనడానికి వెనుకవున్న రహస్యం ఏమిటో గ్రహించు, రవికలేకుండా, తల వెంట్రుకలు లేకుండా నేను వితంతువుగా జీవించినదానికి, రవిక

తొడుక్కొని, తలవెండ్రుకలు వుంచుకొని వితంతువుగా జీవించే లలితకు భేదమేముందే? ఈనాటి వితంతువులు చూడడానికి కాస్త మెరుగ్గా కనిపిస్తారేమో కాని మళ్ళీ పెళ్ళి చేసుకోకుండా వుండి పోతే ఆనాటి వితంతువుకూ ఈనాటి వితంతువుకూ భేదమేముందే''

,, పెద్దమ్మా! సంఘములోవున్న ఆచారాలను పాటించని వారిని సంఘం చిన్నచూపు చూడదా?''

,, మగడు చనిపోయిన తర్వాత నేనే పెళ్ళి చేసుకొని వుంటే సంఘం క్రొన్నాళ్ళు నన్ను చిన్నచూపు చూచేదేమో. కాని నేను హాయిగా ఎన్నో సుఖాలు అనుభవించేదాన్ని. వితంతువులందరూ మళ్ళీ పెళ్ళి చేసుకుంటే చిన్నచూపు చూచే వాళ్ళు మాత్రం ఎవ్వరే? అదే తర్వాత ఆచారమయ్యేది. బాధలు కలిగించే ఏ సంఘ ఆచారానైనా గౌరవించవలసిన పనిలేదే''

,, వితంతువులను పెళ్ళిచేసుకోవడానికి సిద్ధపడే మగవాళ్ళు వున్నప్పుడు కదా పెద్దమ్మా వితంతువుల బాధలు గట్టెక్కేది''

,,నిజమే కాని ముందు ఆడది ఈ దురాచార విషవలయం నుండి బయటకు రావాలి. ఆ సాహసం ఆడదానికి వుండాలి. అప్పుడే ఆడదాని బాధలకు విముక్తి వుంటుంది.''

,, పెద్దమ్మా! ఆచరించనివాళ్ళు ఎన్ని మాటలు చెప్పినా ఆ మాటలకు విలువ వుండదు. నువ్వేదో చెప్తావు కాని లలితకు మళ్ళీ పెళ్ళిచేస్తే మేమెన్ని అవమానాలకు గురికావలసి వస్తుందో నువ్వే ఆలోచించు......''

,,రాధా! నేను చెప్పేది ఒక్కటే. ఎవరి ఇష్టముననుసరించి వాళ్ళు నిర్ణయాలు చేసుకోవలసిందే. లలిత విషయం లలితే చూచు

కోనీ నువ్వు దానికి అడ్డు తగలకపోవడం మంచిది"

"పెద్దమ్మా! ఇదేనా నువ్వు చెప్పేది. మాస్టర్‌గారు ఇలా అన్నారని చెప్తే అదే బాగుందంటావా?"

ఇంతసేపు శ్రోతగా వుండిపోయిన మాస్టర్‌గారు లేచి నిలబడి వెళ్తానని చెప్పి వెళ్ళిపోవడంతో ప్రసంగం ఆగిపోయింది.

# 3

మారుతి రామకోటిరాస్తున్నాడు.

రామారావు మాస్టారు మారుతి దగ్గరకు వచ్చి అన్నాడు "లెక్కతీశావా?"

"లేదండి"

"లెక్కతీయకుండా రామకోటి రాస్తున్నావేమిటి?"

"నేను భగవంతుని భక్తుణ్ని కదా మాస్టారూ అందుకే రాస్తున్నాను"

"తరగతి గదిలో రామకోటి రాయకూడదని నీకు తెలియదా?"

"రామకోటిరాస్తే పుణ్యం వస్తుందని మా అమ్మ చెప్పింది. పుణ్యాత్ములే పరీక్షలలో పాసవుతారట కదండీ"

మాస్టారుకు కోపం వచ్చింది, అతడు మారుతి ముందున్న రామకోటి కాగిదాలను తీసి అతని సంచిలో పెట్టేసి అతని చెంపపగుల గొట్టాడు.

"అయ్యో మాస్టారూ! రామకోటి రాసేవాళ్ళను కొడితే పాపం తగులుతుందండీ"

"నోరు మూసుకొని లెక్క చెయ్యాలోయి. లెక్కలు తీయ కుండా రామకోటి రాస్తే లెక్కలు రావోయి. పాసు కావాలంటే లెక్కలు చెయ్యాలోయి."

ఆ పీరియడ్ అయిపోయిన వెంటనే మారుతి ఇంటికి వచ్చాడు. పుస్తకాలను బంతి విసిరినట్టుగా గూటివైపు విసిరి కొట్టాడు. అందులో నుండి రెండు పుస్తకాలు గూట్లో పడ్డాయి. మరో రెండు పుస్తకాలు క్రింద పడ్డాయి. అందులో ఒక పుస్తకం కమ్మలు చినిగాయి. మరో పుస్తకం దారం తెగిపోయి కమ్మలన్నీ చిందర వందరగా పడ్డాయి. అతడు అదేమీ గమనించకుండా వంటింట్లోకి వెళ్లాడు.

రాధమ్మ పెసరట్లు చేస్తూవుంది. మారుతి ఓ పెసరట్టు అందుకొని తింటూ తల్లితో అన్నాడు. "రామారావు మాస్టారు రామకోటి రాస్తుండగా చూచి నా చెంప పగుల గొట్టాడమ్మా"

"నీకు బుద్ధిలేదురా. క్లాసులో రామకోటి రాయొద్దని నేను చెప్పలేదూ? క్లాసులో లెక్కలు చెయ్యాలి. ఇంట్లో రామకోటి రాసు కోవాలి. రామకోటి రాసినా రాయకపోయినా లెక్కలు మాత్రం తప్పని సరిగా చెయ్యాలి"

"అయితే నాది తప్పేనంటావా అమ్మా" అన్నాడు దీనంగా ముఖం పెట్టి.

"తప్పే. ముమ్మాటికీ తప్పే......" రాధమ్మ ఇంకా ఏదో అనబోతుండగా "అమ్మగారూ!" అంటూ గడ్డి ముసలమ్మ పిలిచింది.

రాధమ్మ అట్లు పోయడం ఆపేసి బయటకు వచ్చింది.

గడ్డి ముసలమ్మ పచ్చిగడ్డి మోపును గద్దె మీద దించి

దానికి కట్టివున్న తాళ్ళను విడిచింది. ఆ మోపులో సుమారు వంద కట్టలున్నాయి. అన్నీ చిన్న చిన్న కట్టలు. అందులో నుండి ఆమె పాతిక కట్టలు గోడ దగ్గరవేసి అంది "ఈ నెలలో మొదటి వారంలో అయిదు రోజులు రోజుకు ఇరవై అయిదు కట్టలచొప్పున రెండవ వారంలో ఆరురోజులు రోజుకు ఇరవై రెండు కట్టల చొప్పున, మూడవ వారములో నాలుగు రోజులు రోజుకు ముప్పయి కట్టల చొప్పున, నాల్గవ వారంలో ఏడురోజులు రోజుకు ఇరవై కట్టల చొప్పున వేశాను. మొత్తం ఎన్నికట్టలు అవుతాయో లెక్క కట్టి డబ్బు ఇవ్వండి"

రాధమ్మ మారుతిని పిలిచి గడ్డి లెక్క చెప్పింది. అతడు కలం, కాగిదం తీసుకొని వచ్చాడు. పది నిమిషాలసేపు కాగిదాలతో కుస్తీ పట్టాడు. రెండు తెల్లకాగిదాలను నలుపు చేశాడు. విసుగుతో వాటిని చింపివేశాడు "ఈ చిన్న లెక్క మీకు రావడం లేదా?" అంటూ బ్రహ్మాండమైన ఫోజుపెట్టాడు. మొత్తం నాలుగు వందల అరవైఅయిదు కట్టలు. వాటి విలువ ఇరవైనాలుగు రూపాయల అయిదు పైసలు" అని చెప్పాడు. చేతిలోవున్న కలాన్ని కుర్చీలో పడేసి వీధిలోకి పరుగెత్తాడు.

మారుతి కాగిదాలతో యుద్ధంచేసి తీసిన లెక్క నూటికి నూరుపాళ్ళు తప్పని రాధమ్మకు తెలుసు. అయినా ఆమె మారుతి చెప్పిన లెక్క ప్రకారమే ముసలమ్మకు డబ్బు ఇచ్చింది. ముసలమ్మ వెళ్ళిపోయింది. మళ్ళీ అరగంట కాకముందే తిరిగి వచ్చింది. ఆమె వెనుక మారుతి కూడా వచ్చాడు.

"ఏంటే మళ్ళీ వచ్చావు?" అంది రాధమ్మ ఛీఛీపి నవ్వను

ప్రదర్శిస్తూ

" మీరు తెలిసిన వారని నమ్మితే ఇలా చేస్తారటమ్మా. మాటల సందర్భములో కోమటాయనకు చెప్పాను కాబట్టి నిజం బయటపడింది. ఇంకా నాకు రూపాయి ఎనభై పైసలు రావాలట. నాకు లెక్కలు రావని, నాకు లెక్కలు చేసే దిక్కెవ్వరూ లేరని ఇల్లా చేస్తారటమ్మా ......ఇంతకు ముందు కూడా ఎన్నిసార్లు మోసం చేశారో'' అంది కొంచెం కోపంతో.

" మోసం చేసే అలవాటు మా ఇంటి చరిత్రలోనే లేదు. నువ్వు తెచ్చిన గడ్డితిని నా బర్రె చాలా చిక్కిపోయింది. అంతకు ముందు అది పోతులా వుండేది... పచ్చిగడ్డి వేస్తే పాలు ఎక్కువగా ఇవ్వాలికదా! కాని ఇవ్వడం లేదు. అంటే నువ్వు తెచ్చినగడ్డి మంచిది కాదన్నమాట. అందువల్ల నువ్వు వేసిన గడ్డికి నేను ఇచ్చిన డబ్బుకు సరిపోయింది. ఇందులో నేను చేసిన మోసం ఏముంది?''

ముసలమ్మ అదేమీ విన్పించుకోకుండా " డబ్బు తొందరగా ఇవ్వండి. నాకు అవతల పనుంది" అంది.

మారుతి కలుగజేసుకొని అన్నాడు " ముసలమ్మా! నీగడ్డి తినక ముందు మా బర్రె పాలు ఇచ్చేది కాదు. పాలు ఇవ్వక పోవడం వల్ల అది పోతోయేమో అని నాకు చాలాసార్లు అనుమానం వచ్చింది. అసలు అది పోతుగా జన్మించి నీ గడ్డితిని బర్రెగా మారిపోయిందని నాదృఢ విశ్వాసం, నీ గడ్డితిని అది అడ్డెడు పాలు ఇస్తుంది కనుక ఆ పాలన్నీ నీగడ్డివల్లనే ఇస్తుందని నా సంపూర్ణ విశ్వాసం. కనుక మా అమ్మ నీకు ఇవ్వవలసిన

డబ్బంతా ఇచ్చేస్తుంది తీసుకపో''

రాధమ్మ మారుతిని ఎర్రగా చూచింది. మారుతి గాలి పటాన్ని తీసుకొని వీధిలోకి వెళ్ళిపోయాడు.

# 4

రేపు లెక్కల పరీక్ష. ఈ విషయం జ్ఞప్తికిరాగానే మారుతి గుండెల్లో రైళ్ళు పరుగెత్తాయి. రామారావు మాస్టారును పరీక్షలో పడే ప్రశ్నలను అడిగి తెలుసుకోవాలనుకున్నాడు. ఈ ఆలోచన వచ్చిన వెంటనే అతడు మాస్టారు దగ్గరకు వచ్చాడు. కపట దైవ భక్తుడు దేవునికి ఏవిధంగా సాష్టాంగా నమస్కారము చేస్తాడో ఆవిధంగా మాస్టారుకు సాష్టాంగ నమస్కారం చేశాడు.

"భక్తా గ్రేసరా లెమ్ము. పరీక్షల ముందున్న నీ నటనా భక్తికి మెచ్చితిని నీకు ఏసైజు వరాలు కావాలో ఎన్ని కిలో గ్రాముల వరాలు కావాలో కోరుకో" అన్నాడు.

మాస్టర్‌గారి మాటలు విని మారుతి గాలిలో తేలిపోయాడు. శ్రీరామచంద్రుని ముందు అపర హనుమంతునివలె మాస్టర్‌గారి ముందు అతడు అతి వినయంగా కూర్చుండి అన్నాడు "మాస్టారూ! ......యూఆర్ గాడ్ మాస్టారు......మాస్టారు......''

''ఏం కావాలి నాయనా!''

" వరం కావాలి మాస్టారూ! ....వరం ...ఎనిమిదవ తర గతిలో పాసయ్యేలా వరం కావాలి"

" భక్తా గ్రేసరాలెమ్ము...కష్టపడి చదువుకొమ్ము. నీకోరిక సిద్దిస్తుంది.

ఈమాట వినగానే మారుతి ముఖం కోతిముఖంలా తయా రైంది.

"మాస్టర్‌గారూ! నన్ను కనికరించండి. రేపు జరగబోయే పరీక్షలో రాబోయే ప్రశ్నలు చెప్పండి మాస్టారూ!" చేతులు జోడించి వినయంగా అన్నాడు మారుతి.

"డియర్ మారుతీ నేను నిమిత్త మాత్రుడను. రేపటి పరీక్షలో ఏ ప్రశ్నలు వస్తాయో నేను చెప్పజాలను. నువ్వు రోజూ గుడికి వెళ్ళి పూజలు చేసి వస్తావుకదా. ఈరోజు గుడికి వెళ్ళగానే పరీక్షలో వచ్చే ప్రశ్నలు చెప్పుమని దేవుణ్ణి అడుగు"

"పరీక్షలో వచ్చే ప్రశ్నలు దేవునికెలా తెలుస్తాయి మాస్టారూ?"

"దేవుడు సర్వాంతర్యామి అని అంటావు కదా మారుతీ అలాంటి వానికి తెలియని విషయం వుంటుందా?

"మీరు అడుగుమంటున్నారు కాబట్టి అడుగుతాననుకోండి. కాని దేవుడు నాతో మాట్లాడుతాడా మాస్టారూ?"

"ఎందుకు మాట్లాడడు? మంచి మనస్సుతో దేవునికి పూజలు చేస్తే ప్రత్యక్షమవుతాడనీ, మాట్లాడుతాడనీ నీవే కదా అన్నావు".

"అన్నాను నిజమే. నేను దేవునికి మంచి మనస్సుతో పూజలు చేస్తున్న మాట కూడా నిజమే. కాని దేవుడు ఏనాడూ నాకు ప్రత్యక్షం కాలేదు. నాతో మాట్లాడలేదు మాస్టారూ"

"మంచి మనసుతో పూజలు చేసినా నీకు దేవుడు కని పించడు. నువ్వు పుస్తకాలు చదువకుండా పాసుకావాలనే ఉద్దేశ

ముతో దేవుణ్ని పూజిస్తున్నావు. నీకు కలిగిన అభిప్రాయమే తప్పుడు మార్గంలోవుంది. అభిప్రాయం సరియైనది కానప్పుడు ఫలితం కూడా తప్పుడు మార్గంలోనే వుంటుంది. శ్రమచేయకుండా విగ్రహాలను పూజిస్తూ అన్యాయంగా ఫలితం పొందాలనుకునేవాడు దొంగలాంటివాడు. నీకు దొంగలా బ్రతకాలని వుందా? పుస్తకాలు చదవకుండా పరీక్షలు పాసుకావాలనుకునే విద్యార్థులు పెండలోని పుడుగులకన్నా హీనం కాదా?''

మారుతి చాలా చిన్నకంఠంతో మళ్ళీ అడిగాడు ''లెక్కల్లో ఇంపార్టెంట్ చెప్పండి సార్. అంకగణితములో చక్రివడ్డీ లెక్కలు వస్తాయా సార్''

''చక్రివడ్డీ లెక్కలు నేర్చి నీవద్ద డబ్బున్నప్పుడు పేదవారికి అప్పిచ్చి ఆ డబ్బును చక్రవడ్డీతో వసూలుచేసి పేదవారి బ్రతుకులను నాశనం చేస్తావా?''

మాస్టర్‌గారి మాటలు ఏమీ అర్థం కానట్టుగా ముఖం పెట్టాడు మారుతి.

'సరాసరి లెక్కలు వస్తాయా సార్'' అన్నాడు మళ్ళీ మెల్లగా.

''ధనికులకు, పేదవారికి మధ్యవున్న అసమానతలను తగ్గించుటకోసం ''సరాసరి'' ఎంతో కష్టపడి చివరకు క్షయవ్యాధికి గురిఅయింది" అన్నాడు మాష్టారు బాధనటిస్తూ.

మారుతి గుడ్లుతేలవేసి "ఓ సరాసరీ ఎంత ఘోరం జరిగిందే నీకు'' అని ఏడ్చినంత పనిచేశాడు. క్షణంసేపు మౌనం వహించిన అతడు మళ్ళీ అన్నాడు "చతురస్రం వస్తుందా సార్?

ఇంకెక్కడి చతురస్రం మారుతీ! అది ఏనాడో కాల గర్భంలో కలిసిపోయింది. బీదవారిని, ధనికులను అన్నిరంగాలలో సమానం చేయాలని తన సమానమైన భుజాలతో, సమానమైన కోణాలతో ప్రయత్నించి తన ప్రయత్నం విఫలం కావడంతో విలపించి విలపించి ప్రాణత్యాగం చేసింది.''

"త్రిభుజాలు వస్తాయాసార్" అన్నాడు మారుతి నీరస కంఠంతో.

మాష్టారు అసహనంగా మారుతి ముఖంలోకి చూస్తూ అన్నాడు "భోజనం అయిందా!''

''ఈరోజు ఏకాదశి శనివారం కదండీ...మేమీరోజు ఉప వాసమేచేస్తాం. చతుర్మాసాలు అంటే మార్గశిరం, పుష్యం, మాఘం, ఫాల్గుణం, ఈ నాలుగు నెలల్లో ఏకాదశి శనివారాలు నిరాహారంగానే వుంటామండీ''

మాష్టారు కుతూహలంగా వినడం చూచిన మారుతి ఇంకా ఇలా చెప్పసాగాడు '' ప్రతి ఏకాదశినాడు ఒక్కటే పూట భోజనం చేస్తాం. ప్రతి శనివారం, సోమవారం సూర్యాస్తమయం అయిన తర్వాత మాత్రమే భోజనం చేస్తాం శ్రావణ శనివారాలు నిరాహారంగానే వుంటాం. మహాశివరాత్రినాడు నిరాహారంగానే వుంటాం ....''

''మీరు పాటించే ఈ నియమాలు చాలా చక్కగావున్నాయి. ఆరోగ్యం కాపాడుకోవడానికి తద్వారా ఎక్కువ కాలం బ్రతకడా నికి ఈ నియమాలు చాలా ఉపకరిస్తాయి. శాస్త్రీయమైన ఇలాంటి నియమాలు పాటిస్తున్న నిన్ను అభినందిస్తున్నాను. విద్యారంగంలో

కూడా శాస్త్రీయమైన ఆలోచనలతో అభివృద్ధి చెందుతావని ఆశిస్తు న్నాను''

"అలాగే మాష్టారూ" అని చెప్పి ఉత్సాహంగా ఇంటికి వచ్చాడు. రాధమ్మ కొడుక్కు ఎదురుగా వచ్చి "ఇంపార్టెంట్ చెప్పాడా?" అని అడిగింది.

మారుతి జ్ఞానిలా ఫోజుపెట్టి "లేదు. కాని పాసయ్యే మార్గం చెప్పాడు'' అన్నాడు.

# 5

మారుతికి లెక్కల పేపర్లో డెసిమల్ ఏడు అయిదు శాతం మార్కులు వచ్చాయి. శంకరయ్య అనే విద్యార్థికి డెబ్బయి శాతం మార్కులు వచ్చాయి. మిగతా విద్యార్థులకు వచ్చిన మార్కులు అరవై శాతానికి మించలేదు.

మందమతి మారుతి డెసిమల్ ఏడు అయిదు శాతమును డెబ్బయి అయిదు శాతం అనుకొని తెగమురిసిపోయాడు. అతడు ఇంటికి వచ్చాక తల్లితో అన్నాడు "అమ్మా! నాకు లెక్కల పేపర్లో అందరికంటే ఎక్కువ మార్కులు వచ్చాయి. ప్రయత్నం చేస్తే చచ్చిన లెక్కలు రాకుండా వుంటాయా? ఇకముందు చూడు నా తడాకా లోకమంతా ఆశ్చర్యపోవాలి. కలాసులో నన్ను చూచి నవ్వినోళ్ళంతా ఏడ్చితీరాలి......''

రాధమ్మ అంతులేనంత ఆశ్చర్యపడుతూ అంది "నాయనో, నా నాయినో ఎంత శుభవార్త చెప్పావురా. కలాసులో ఫస్టు వచ్చావా......రారా నాయనా నీకోసం దధ్యోజనంచేశాను తిందువుగానిరా''

మారుతి తల్లివెంట వంటింట్లోకి వచ్చాడు. ఆమె పీట వాల్చింది. అతడు కూర్చున్నాడు. ఆమె దధ్యోజనం వున్న పాత్రవద్దకు వచ్చింది. దానిమీది మూతతీసి చూసింది, అది సగం ఖాళీగా కనిపించింది. గతదినం ఉపవాసం చేయడంవల్ల ఆకలితో వున్న లలిత, రాధమ్మ పక్కింటావిడతో కబుర్లాడడానికివెళ్ళినప్పుడు, వడ్డించుకొని తింది. అది గ్రహించిన రాధమ్మ లలితవున్న గది లోకి వచ్చి ఆమెకు తిట్టవచ్చిన తిట్లన్నీ తిట్టింది.

"అమ్మా! నేనేం తప్పుపని చేశానని తిడుతున్నావే?" అంది లలిత బాధపడుతూ.

"మగడు చచ్చినదానవు, యవ్వనంలో వున్నదానవు. అంత ఆహారం తినగూడదు. అందులో రుచికరమైన ఆహారపదార్థాలు అసలు తినగూడదు. ఈ విషయం ఇంతకుముందు నీకు పదసార్లయినా చెప్పాను. నా మాట మన్నించని నిన్ను తిట్టుటేకాదు కొట్టి చంపినా పాపంలేదు"

# 6

వరలక్ష్మి అయిదు గంటలకే నిద్రనుండి లేచింది. స్నానం కోసం బాయిలర్‌లో నీరుపోసి నిప్పంటించింది. తర్వాత ముఖం కడుక్కుంది.

సుబ్బారావు ఇంకా లేవలేదు.

వరలక్ష్మి సుబ్బారావు దగ్గరకు వచ్చి అంది "సుబ్బారావు గారూ! లేవండి"

సుబ్బారావు:— వరాలూ! ఏమిటీ విశేషం రోజూ ఏడు గంటలకైనా లేవని నువ్వు ఈరోజు తెల్లవారక ముందే లేచి పైగా

నన్ను కూడా లేపుతున్నావు

వరలక్ష్మి :- ఈరోజు కార్తీక పూర్ణిమ కదండీ?

సుబ్బారావు:-అవును......అయితే?

వరలక్ష్మి :- అయ్యోరామ. మీరు పెద్ద టీచరన్నమాటేకాని ఏమీ తెలియదు. ఈరోజు శనివారం కదండీ. ఆరు గంటలకే దుర్ ముహూర్తం వస్తుంది. మళ్ళీ తొమ్మిది గంటలవరకు వెళ్ళదు. అందుకని మనం ఈ లోగానే స్నానం, పూజ పూర్తి చెయ్యాలి. మీరు ముఖం కడుక్కోండి. ఈ లోగా నేను స్నానానికి వేడి నీళ్ళు తెస్తాను.

"వరలక్ష్మి గారి ఆజ్ఞను సుబ్బారాయుడు అమలుపరచ బోతున్నాడు'' అన్నాడు సుబ్బారావు నవ్వుతూ.

సుబ్బారావు ముఖం కడుక్కొని తలకు నూనె అంటుకొని స్నానాలగదిలోకి వెళ్ళిపోయాడు.

ఇంతలో మారుతి మరో అయిదారుగురు ట్యూషన్ చెప్పించుకునే పిల్లలు ఇంట్లో చొరబడ్డారు. వరలక్ష్మి వాళ్ళను కూర్చుండుమని చెప్పి వేడినీళ్ళ బాల్చీ పట్టుకొని స్నానాల గదిలోకి వెళ్ళింది.

సుబ్బారావు చెంబుతో నీళ్ళు ముంచుకుంటూ శరీరమంతా తడుపుకున్నాడు. వరలక్ష్మి ఉసిరికాయ ముక్కతో అతని వీపు రాయబోయింది.

సుబ్బారావు:- వరాలూ! ఇదేమిటి? పరిమళాలు వెదజల్లే సబ్బులన్నీ పక్కకునెట్టి నీవేదో కొత్త సబ్బును రాస్తున్నావేమిటి?

వరలక్ష్మి :- మీతెలివి తేటలకు సంతోషించాను లెండి

కార్తీకపూర్ణిమనాడు ఉసిరికాయగాక ఆగబ్బు సబ్బులు వాడుతారా ఏండీ.

సుబ్బారావు:- ఆహాఁ! అలాగా...ఈ సబ్బు నుండి వీచే సువాసన నీ ముక్కులోకి వెళ్ళి గబ్బుగా మారుతుందన్నమాట. అయితే నీముక్కు చెడిపోయిందన్నమాటే. డాక్టరుకు చూపించి ముందు నీముక్కు బాగుచేయించాలి. అది సరేగాని వరాలూ ఉసిరికాయరాసుకుంటే లాభమేమిటే?

వరలక్ష్మి :- ఆ విషయం నాకేం తెలుసు. పెద్దవాళ్ళను నేను అనుకరిస్తున్నానంతే. ప్రతి చిన్నపనిలో లాభనష్టాలు బేరీజు వేస్తూ కూర్చుంటే ఏపనీ చేయలేమండీ. పెద్దవాళ్ళు చెప్పిన విధంగా నడుచుకోవాలి.

సుబ్బారావు:- "పెద్దవాళ్ళు బావిలో దూకుమంటే దూకవల సిందేనా? మంచీ-చెడూ ఆలోచించవలసిన అవసరం లేదా?

వరలక్ష్మి:- ఎందుకు లేదూ! కానీ మన పెద్దవాళ్ళు మనం చెడిపోయే పద్దతులు ఏవీ చెప్పరు కదండీ?

సుబ్బారావు:- ఎందుకు చెప్పరు.........పూర్వం మన పెద్దవాళ్ళు కొన్ని చెడ్డ పద్దతులు కూడా ప్రవేశపెట్టారు......ఉదాహరణకు సతీసహగమనం సతీసహగమనం అంటే చనిపోయిన భర్తతోపాటు ఆయన భార్యను బలవంతంగా చితిలోవేసి కాల్చి చంపడం ఈ విషయం నీకు తెలియదులే చాలాకాలం క్రితం మన దేశంలో ఇలాంటి దురాచారముండేది. కొందరు మహాత్ములూ ప్రయత్నించి ఈ దురాచారాన్ని మాన్పించారు.

వరలక్ష్మి :- ఉసిరికాయ శరీరానికి రాసుకోవడం సతీ

సహగమనం లాంటి దురాచారమటండీ ”

సుబ్బారావు:— కాదులే. ఉసిరికాయ శరీరానికి రాసుకుంటే చర్మము మృదువుగా వుంటుందని మా తాత నా చిన్నతనంలో చెప్పాడు. మరి ఆ విషయం ఎంతవరకు నిజమో నాకు తెలియదు. డాక్టర్‌గారి నడిగితే సరియైన సమాచారం తెలుస్తుందనుకో......

సుబ్బారావు కొంచెంసేపు ఆలోచించి మళ్ళీ ఇలా అన్నాడు. "చూడు వరలక్ష్మి! ఏ ఆచారమైనా గ్రుడ్డిగా ఆచరించేకన్నా ఆచరించక పోవడం చాలామంచిది ఒక ఆచారములోనున్న మంచీ చెడులను ఆలోచించిన తర్వాత మనకు మేలు చేకూర్చే ఆచారమైతే తప్పని సరిగా ఆచరించవలసిందే!......కొందరు మన పెద్దవాళ్ళ ఆచారాలను ఎంత గ్రుడ్డిగా ఆచరిస్తారో, కొందరు అంత మూర్ఖత్వంగా విమర్శిస్తారు. మంచీం-చెడూ ఆలోచించి మంచిని ఆచరించడం అన్నింటికన్న ఉత్తమం ఏమంటావు?"

వరలక్ష్మి:— ఇంకేమంటాను. నిజమేనంటాను.

సుబ్బారావు స్నానం పూర్తయింది. వరలక్ష్మి కుంకుమ భరణి పట్టుకొని వచ్చి భర్తకు బొట్టుపెట్టింది.

సుబ్బారావు:— వరలక్ష్మిదేవిగారూ! కుంకుమ నుదుట ఎందుకు ధరిస్తారంటావు?

వరలక్ష్మి:— మీరు అన్నం ఎందుకు తింటారో చెప్పండి ముందు?"

సుబ్బారావు:— బ్రతకడం కోసం, శరీరావయవాలన్నీ సక్రమంగా పనిచేయడంకోసం తింటాం. ఇక ఈ కుంకుమ ఎందుకు పనికివస్తుందంటావు?

వరలక్ష్మి:— ఆహారం తింటే లాభం వున్నట్లే కుంకుమ ధరిస్తే కూడా ఏదోలాభం వుండకపోదు

సుబ్బారావు:— అదే ఏమిటీ అంటున్నాను?

వరలక్ష్మి:— అదే ఏమిటో తెలియదూ అంటున్నాను..... పోనీ మీరు చెప్పండి.

సుబ్బారావు:— కుంకుమ నుదుటి ప్రాంతములో ధరిస్తే ఆ ప్రాంతములో వుండే నరాలకు మేలు చేకూరుతుందట.

వరలక్ష్మి:- ఈ విషయం ఎవరు చెప్పారేమిటి మీకు?

సుబ్బారావు:— నా స్నేహితుడొకడు.

వరలక్ష్మి:— అతడు కూడా మీలాగే గొప్ప తెలివితేటలు కలవారనుకుంటాను.

సుబ్బారావు:- ఇదిగో వరాలూ! ఆ చెప్పిన మిత్రుడు తెలివికలవాడైనా కాకపోయినా నేను మాత్రం తెలివికలవాడినే ఆ విషయం గుర్తుంచుకో.

వరలక్ష్మి - కాళ్ళకు పసుపు రాసుకుంటే కలిగే మేలేమిటో కూడా చెప్పాడా మీ మిత్రుడు?

సుబ్బారావు:- కాళ్ళకు పసుపురాసుకుంటే కాళ్ళకు అంటు కున్న సూక్ష్మక్రిములు చనిపోతాయని ఎవరో ప్రకృతి వైద్యుడు చెప్పగా విన్నాను.

వరలక్ష్మి:- ముత్తైదువలు మాత్రమే నుదుట కుంకుమ ధరించాలనీ, కాళ్ళకు పసుపు రాసుకోవాలనీ పెద్దలు చెప్పగా విన్నా ను, కానీ మీరు చెప్పినట్లు పసుపు కుంకుమలవల్ల ఇలాంటి లాభాలు న్నాయన్న విషయం మాత్రం నాకు తెలియదు. మీరు చెప్పింది

నిజమేఅయితే మీరు కూడా కాళ్ళకు, చెంపలకు పసుపు ఎందుకు పెట్టుకోరు? ప్రతిదినం నుదుట కుంకుమబొట్టు ఎందుకు పెట్టుకోరు? అయితే వుండండి మీ కాళ్ళక్కూడా పసుపు రాస్తాను.

సుబ్బారావు వరలక్ష్మి చేయిపట్టుకొని దగ్గఱకు లాక్కొని ఇలా చెప్పాడు. "పూర్వకాలంలో పాదరక్షలు చాలామందికి అందుబాటులో ఉండేవికావు. అందువలన పసుపు పూసుకొని సూక్ష్మక్రిములబారి నుండి తమ్ముతాము రక్షించుకునేవారు. అయితే ఆ రోజుల్లో ఆడవాళ్ళే కాకుండా మగవాళ్ళు కూడా కాళ్ళకు పసుపు పూసుకునేవారు. పాదరక్షల ఉత్పత్తి పెరిగిన తర్వాత మగవాళ్ళు కాళ్ళకు పసుపు పూసుకోవడం మానుకున్నారు. ఆడవాళ్ళు మాత్రం ఆ అలవాటును మానుకోలేదు."

వరలక్ష్మి:— పాదరక్షలకు సూక్ష్మక్రిములను చంపే శక్తి వుందంటారా?

సుబ్బారావు:— పాదరక్షలకు సూక్ష్మక్రిములను చంపేశక్తి లేదు. కాని భూమిమీదున్న సూక్ష్మక్రిములు మనం నడచునప్పుడు పాదరక్షల అడుగు భాగమున మాత్రమే అంటుకుంటాయి. నష్టం జరుగదు. పూర్వకాలపువారు పాదాలకు పసుపు రాసుకొని ఏలాభం పొందేవారో పాదరక్షలు ధరించి మనమిప్పుడు ఆ లాభం పొందుతున్నామన్నమాట.

వరలక్ష్మి:- చాల్లెండి మీ తెలివితేటలు. నేను తెలివితక్కువదాన్నన్నమాట నిజమేకాని మీరు ఏదిచెప్పితే అది నమ్మేంత తెలివి తక్కువదాణ్ణి మాత్రం కాదు. ఈ విషయం ఎప్పుడూ గుర్తుంచుకోండి.

వరలక్ష్మిస్నానం చేయడానికి వెళ్ళిపోయింది. పది నిమి షాల్లో స్నానంచేసి పరిశుభ్రమైన వస్త్రాలు ధరించి పూజాసామగ్రితో తులసి చెట్టుదగ్గఱకు వచ్చింది. పళ్ళెమును తులసి చెట్టుముందు పెట్టింది. ఆ పళ్ళెములో వత్తులు, అక్షతలు, పసుపు, కుంకుమ, గులాలు, పూలు, నూనెపావు, కొబ్బరికాయ మొదలైనవి వున్నాయి.

వరలక్ష్మి పత్తితో రింగులాగా—ఓ ఆకారాన్ని తయారు చేసి తులసి చెటుపైన పెట్టింది. పసుపు, కుంకుమ చెట్టుపైన చల్లి మ్రొక్కింది. తన చుట్టుతాను తిరుగుతూ అక్షతలు, పూలు, తులసిచెట్టుపై వేస్తూ దండం పెట్టింది.

సుబ్బారావు జుత్తు దువ్వుకుంటూ తులసిచెట్టు దగ్గఱకు వచ్చాడు. అతనివెనుక అతని ట్యూషన్ విద్యార్థులుకూడా వచ్చారు.

వరలక్ష్మి:- వచ్చారా! తులసిపై పూలు, అక్షతలు వేయండి.

సుబ్బారావు;- ఎందుకు?

వరలక్ష్మి;- అదేంప్రశ్న? ఇదిమన ఆచారం.

సుబ్బారావు;- నీలాంటి చాదస్తపువాళ్ళు వుండడం వల్లనే భారతదేశం గతి ఈ విధంగావుంది.

వరలక్ష్మి;- నాలాంటివాళ్ళు కొందరైనా వున్నారు గనుకనే భారతదేశం ఈ మాదిరిగానైనా వుండగలిగింది. నాలాంటివాళ్ళు భారతదేశంలో లేనినాడు అధర్మం అన్యాయం, నాస్తికత్వం ప్రబలి దేశం భస్మమైపోతుంది.

సుబ్బారావు:- చూడు వరలక్ష్మి! మూర్ఖత్వంతో వాదించడం ముఖ్యం కాదు. మనంచేసే ఏపనిలోనైనా కొంత ప్రగతి వుండాలి.

నువ్వు ఎప్పుడు ఏపూజ చేసినా ఓగంట కాలాన్ని ఖర్చు చేస్తావు. ఇప్పుడు కూడా ఓగంట కాలాన్ని ఖర్చుచేస్తున్నావు. తులసి చెట్టుకు పూజ చేయడమెందుకు చెప్పు?

అనాదికాలంలో—అనగా ఇప్పటికి నాలుగు వేల సంవత్సరాలకు పూర్వం—నాగరికత తెలియని రోజుల్లో ద్రావిడులు భూతప్రేతాదులను, రాళ్ళను, రప్పలను, పాములను, చెట్లను పూజించేవారు. కాని విజ్ఞానం అభివృద్ధిచెందిన ఈ రోజుల్లో ఆ అజ్ఞానపు పూజ లెందుకు?

ఆ పళ్ళెములోనున్న వంద గ్రాముల పత్తివత్తులను, ఆ పావులోనున్న వందగ్రాముల నూనెను కాల్చివేస్తావు అంతేనా?

వరల్మక్షి:- ఆఁ! అవును.

సుబ్బారావు;- వరాలూ! పత్తివత్తులను, నూనెను కాల్చివేయటం వలన నీకుగానీ, సమాజానికిగానీ ఏమైనా లాభం చేకూరుతుందా?

వరలక్ష్మి;- లాభమా?......ఏమో నాకు తెలియదు.

సుబ్బారావు:— లాభమేమీ వుండదు వరాలూ! పైగా అంతా నష్టమే.

వరలక్ష్మి:— నష్టమా?......ఏమిటది?

సుబ్బారావు:- దూదితో వత్తులు తయారుచేయడానికి వినియోగించిన రెండురోజుల కాలం, ఇప్పుడు పూజకొఱకు వినియోగించే గంట కాలం నష్టపోవడం లేదా?

వరలక్ష్మి - నేనలా భావించడంలేదు.

సుబ్బారావు:- నువ్వు పూజ పేరిట పత్తి, నూనె కాల్చివే

స్తావు. అది నష్టం కాదా?

వరలక్ష్మి:- కావచ్చు.

సుబ్బారావు:- చూడు వరాలూ! నీలాగే దేశంలో కొన్ని లక్షల మంది ఇలాంటి పూజలు చేస్తారు. కొన్నివేల టన్నుల పత్తి, కొన్నివేల కిలోగ్రాముల నూనె కాల్చివేయడం జరుగుతుంది.... దీనిని నువ్వు ఒప్పుకుంటావా?

వరలక్ష్మి:- నిజమేనేమో!

సుబ్బారావు:-నిజమేనేమో అనకు, నిజమేఅను.

వరలక్ష్మి:- సరే నిజమే అనుకోండి.

సుబ్బారావు:- మన సమాజంలో బట్టలు లేక చలితో బాధ పడేవాళ్ళు చాలామంది వున్నారు. మీరీ పూర్ణిమనాడు పత్తివత్తులు కాల్చడం మానుకొని, ఆ పత్తితో నూలు తయారుచేసి, బట్టలు నేసి బట్టలు లేనివారికిస్తే, వారు చలిబాధనుండి తప్పించుకోగలుగు తారు. దేశములో సరియైన ఆహార పదార్థాలు దొరకక చిక్కిపో యిన బక్కవాళ్ళు చాలా మందున్నారు. మీరీ పూర్ణిమనాడు నూనె కాల్చడం మానుకుంటే, ఆ నూనెను ఉపయోగించుకొని కొన్నివేల మంది ప్రయోజనం పొందుతారు......

మీరు పత్తిని, నూనెను కాల్చివేయడంవలన మార్కెట్‌లో ధరలు మరింతపెరిగి, బీదవారికి మరింత ఇబ్బంది కలుగుతుంది. దేవుడనే వాడొకడుంటే, అతడు అందరి క్షేమాన్ని కాంక్షించే వాడైతే, మీ పూజావిధానాన్ని సమర్థించలేడు.

వరలక్ష్మి:- కార్తీక పూర్ణిమనాడు ఇలామంటలు పెట్టడం వలన గాలిలోవున్న చెడుక్రిములు చనిపోతాయని కొందరంటారు

కదండీ.

సుబ్బారావు:— అలా చేయడంవలన గాలిలోవున్న క్రిములు చనిపోయేమాట ఎలావున్న గాలిలో వున్న ప్రాణవాయువు ఎంతో నష్టపడుతుంది. ఇలామంటలు పెట్టకుండా క్రిములు చనిపోవడానికి క్రిమిసంహారక ఔషదాలు వాడడం మంచిదికదా! నూనెకు, పత్తికి పెట్టే ఖర్చులో నాలుగవ వంతు ఖర్చుచేసి మనం సాధించ దలచుకొన్నది సాధించవచ్చు కదా! పూర్వకాలంలో క్రిమిసంహారక ఔషధాలు లేకపోవడం వలన అలా చేసియుండవచ్చు. పూర్వీకులు చేసినట్టే మనమూ చేయాలా? ఏ కాలానికి ఏ ఆచారం బాగుంటుందో దానినే ఆచరించాలి.

వరలక్ష్మి :- దేవుణ్ని పూజిస్తే పుణ్యం వస్తుందంటారు కదండీ?

సుబ్బారావు :- చెట్లను, పుట్టలను, బొమ్మలను చాలామంది దేవుళ్ళని భావిస్తారు పూజిస్తారు, నిజానికి వీటిని పూజిస్తే పుణ్యం రాదు. దేవుడనేది ఒక విశ్వాసం మాత్రమే. ఎవరి విశ్వసాన్ని బట్టి వాళ్ళు దేవుడు ఇలా వుంటాడని రుజువు చేయడానికి ప్రయత్నాలు చేసారు. కొందరు ఆకారాలు కల్పించి దేవుడు ఇలా వుంటాడని చెప్పారు. కొందరు ప్రేమే దైవమన్నారు. కొందరు సత్యమే దైవమన్నారు. ఎవరు ఏమన్నా దేవుని విషయం ఎలా వున్నా మానవ సమాజానికి ఉపయోగపడే విధానాలు నైతిక విలువవ దేశకాల పరిస్థితుల ననుసరించి మారుతూనే వున్నాయి.

దేవుణ్ని పూజిస్తే పుణ్యం వస్తుందని కొందరు భావిస్తారు అది వారికున్న విశ్వాసం.

తిండి, బట్ట, ఇల్లు ఇవి లేనివారు-ఇవి అందేలా ప్రయత్నం చేసే వారి యెడల కృతజ్ఞతా భావం కలిగివుంటారు. సమాజంలో తలయెత్తే అసమానతలను తగ్గించడం కోసం చేసే ప్రయత్నం గొప్పదిగానే భావింపబడుతుంది ఎప్పుడైనా

వరలక్ష్మి;- అయితే నేను మంచి మనసు కల మానవులను దేవుళ్ళుగా భావిస్తాను. మంచి పనులు చేయడాన్ని దేవుని పూజగా భావిస్తాను—అనిచెప్పి చేతిలోవున్న అక్షతలు అక్కడ ఎగురుతున్న పిట్టలవైపు వెదజల్లింది. పళ్లెములోవున్న పూలను తీసి సిగలో తురుముకుంది.

సుబ్బారావు తులసి ఆకులను తెంపి నోటిలో వేసుకున్నాడు. నాలుగాకులు వరలక్ష్మికిచ్చాడు.

వరలక్ష్మి:- ఈ ఆకులు తింటే ఏమైనా లాభం ఉందాండీ?

సుబ్బారావు:- ఇవి తింటే ఆరోగ్యానికి మంచిదని విన్నాను.

వరలక్ష్మి:- అలాగే అయితే రోజూ భోజనమైన తర్వాత ఈ ఆకులతో మీకు విడియం కట్టిమ్మంటారా?

సుబ్బారావు కట్టిమ్మన్నట్టు తలవూపాడు.

మారుతి తులసి అకులు తెంపుతుండగా మిగిలిన వారందరూ వరండాలోకి వచ్చారు. ఇంతలో అక్కడికి యాదగిరి వచ్చాడు అతడు గత సంవత్సరం పదవ తరగతి చదివి పరీక్షలు ఇవ్వకుండానే పౌరోహిత్యంలో దిగాడు.

అతడు పట్టుపంచె కట్టుకొని మంగళహారతి పట్టుకొని వున్నాడు. ట్యూషన్ పిల్లలు అతన్ని కొత్త వ్యక్తిని చూచినట్లు చూడసాగారు. అతడు సినీమాలకు షికార్లకు వెళ్ళేటప్పుడు గంట

బొగ్గండు ప్యాంట్లనే తొడుక్కుంటాడు. దేవుని గుళ్ళోకి వెళ్ళినప్పుడు, వ్రతాలు, నోములు పెళ్ళిళ్ళు తద్దినాలు మొదలగు కార్యక్రమాలు జరిపించడానికి వెళ్ళినప్పుడు మాత్రం పట్టుపంచె కట్టుకునే వెళ్తాడు. అతడు ఈ మధ్యనే ఇలా వేషాలు మార్చడం నేర్చుకుంటున్నాడు.

వరలక్ష్మి పదిపైసల నాణెం తెచ్చి యాదగిరి పట్టుకున్న హారతి పళ్లెములో వేసింది. అతడు దీవెన వాక్యం పలికి వెళ్ళి పోయాడు.

సుబ్బారావు:- పదిపైసలు అనవసరంగా ఖర్చుచేశావు.

వరలక్ష్మి:- దానం చేసిన డబ్బును అనవసరంగా ఖర్చు చేశానని నేననుకోవడంలేదు. దానంచేసిన వారికి పుణ్యం వస్తుంది.

సుబ్బారావు :- నువ్వు దానంచేసి పుణ్యం వస్తుందని భావించి తృప్తి పడుతున్నావు. దానంచేస్తే పుణ్యం వస్తుందన్న స్వార్థ బుద్ధి దానం చేసేవారికి ఉండకూడదు. నీవిప్పుడు అపాత్ర దానంచేశావు. అపాత్ర దానం చేసిన వారికి పుణ్యంరాదు. వస్తే పాపం వస్తుందేమో!

వరలక్ష్మి:- బిచ్చగానికి మాత్రమే దానం చెయ్యాలన్నారు కదా ఇంతకు ముందొకసారి మీరన్నట్టుగా బిచ్చగానికే దానం చేశాను. అలాంటప్పుడు నేను చేసింది అపాత్రదానం ఎలా అవు తుంది? ఇతడు అగ్రకులం అనబడే కులంలో పుట్టినవాడే అయినా ఆర్థికంగా ఉన్నతస్థాయిలోవున్న కుటుంబములో జన్మించినవాడే అయినా బిచ్చమెత్తుకుకొంటున్నాడు కనుక బిచ్చగాడే. బిచ్చగానికి కాక ఇంకెవరికి దానం చేస్తాం చెప్పండి?

సుబ్బారావు:- నా అభిప్రాయం చెప్తావిను. ప్రస్తుత మన

ఆర్థిక వ్యవస్థననుసరించి బిచ్చగానికో ప్రత్యేకమైన యోగ్యత వుండాలోయ్. అదేమిటంటే పనిచేయుటకు శక్తిలేని వ్యక్తికి ఎలాంటి ఆస్తికూడా లేకపోతే ఆవ్యక్తి బిచ్చమెత్తుకోవడానికి అర్హుడు. ఈ యోగ్యత ఉన్నవానికి దానంచేస్తే ఫర్వాలేదు. లేకపోతే అపాత్రదాన మవుతుంది.

వరలక్ష్మి :- అయితే దానంచేసే సందర్భంలో బిచ్చగాని యోగ్యతను దృష్టియందుంచుకోవాలన్నమాట.

సుబ్బారావు:— అంతేగామరి.

వరలక్ష్మి :- నవ్వుకుంటూ వంటింట్లోకి వెళ్ళిపోయింది.

సుబ్బారావు పిల్లలకు సైన్సు పాఠం చెపుండగా మారుతి అక్కడకు వచ్చాడు. అతని నోటినిండా, షర్టు జేబునిండా తులసి ఆకులు వున్నాయి. అది చూచి మాస్టారు అన్నాడు "మందమతి మారుతిగారూ! మేకలాగ ఆకులు నములుతున్నావేమిటోయి''

మారుతి:- ఈ ఆకులు తింటే ఆరోగ్యానికి మంచిదన్నారుగా మీరు అందుకని తింటున్నాను.

మాస్టారు :— ఏమి ఆకులవి?

మారుతి :- తులసి ఆకులు

మాస్టారు;— జేబులోవున్నవి కూడా తులసి ఆకులేనా?

మారుతి :- అవును మాస్టారు.

మాస్టారు:— చెట్టుకు ఆకు లేకుండా చేశావా?

మారుతి:— చేశానండి. నా ఆరోగ్యం బాగుండదండీ అందుకనండి. ఈ ఆకులన్నీ తిందామని చెట్టుకు ఆకు లేకుండా చేసి జేబు నింపేశానండి ఈ ఆకులన్నీ తింటే నా ఆరోగ్యం బాగుపడు

తుందాంకీ!!

మాష్టారు మొద్దబ్బాయి మాట విన్పించు కోకుండా ఈ విషాద వార్త వరలక్ష్మికి విన్పించడానికి నవ్వుకుంటూ వంటింటి వైపు వెళ్ళిపోయాడు.

# 7

కూలీ పనిచేసి ఇంటికి తిరిగివస్తున్న చంద్రయ్యకు, తన చిట్టి చెల్లెలు సరిత పాముకాటుతో చనిపోయిందని మారుతి చెప్పగా తెలిసింది. అతడు దుఃఖాన్ని ఆపుకోలేక బావురుమని ఏడుస్తూ ఇల్లు చేరుకున్నాడు.

ధర్మశాల దగ్గర వున్న ముత్యంరావు పొలంలో వరికోయ డానికి వెళ్ళిన చంద్రయ్యతల్లి సరితను కూడా వెంటబెట్టుక వెళ్ళింది. ఆమె వరికోయుటలో నిమగ్నమై వున్న సమయములో, సరిత ధర్మశాల దక్షిణగేటు వద్దవున్న పాము పుట్టవద్దకు వచ్చింది. అన్నీ వున్నవాళ్ళు, పనిలేక తీరికగా వుండేవాళ్ళు ఆ పాముపుట్టకు రోజూ పూజలు చేస్తారు. పాలుపోస్తారు, కొబ్బరికాయలు కొట్టి ముక్కలు నైవేద్యం పెడుతారు. ఆకలికి తట్టుకోలేక కొబ్బరి ముక్కలు ఏరుకతింటున్న సరిత పాము కాటుకు గురై చనిపో యింది.

సరిత శవాన్ని భూమిలో పాతిపెట్టి ఏడుస్తూ భారంగా అడుగులువేస్తూ ఇంటికి తిరిగివచ్చారు.

ఆరేళ్ళ క్రితం తెల్లవారకముందే కరంటు మోటారు పెట్ట డానికి వెళ్ళిన చంద్రయ్య తండ్రి రాజయ్య కరంటు షాక్‌తో

చనిపోయాడు. చెడిపోయిన పైరు తీసేయించి మంచి పైరు పెట్టించుమని ఎన్నిసార్లు చెప్పినా ముత్యంరావు పట్టించుకోలేదు. పైగా చెప్పిన రాజయ్యను కసిరికొట్టాడు, తిట్టాడు.

ఇదంతా తలచుకుంటూ తల్లి ఏడుస్తూవుంటే చంద్రియ్యకు పట్టరాని కోపం వచ్చింది. పుట్టలను పూజించేవాళ్ళ మీద, తలలో విషముండే పాములమీద, నిలువెల్లా విషముండే ముత్యంరావు లాంటి వాళ్ళమీద.

అతడు కట్టెపట్టుకొని వడివడిగా పుట్టవైపు బయలుదేరాడు. అంతవరకు దగ్గరవుండి ఓదారుస్తున్న మిత్రులు కూడా కట్టెలు పట్టుకొని అతని వెంట వెళ్ళారు.

"ఈ కట్టెలతో పామునైతే చంపగలం గానీ "పాము" నివసిస్తున్న "పుట్ట"ను ఎలా త్రవ్వగలం" అన్నాడు శంకరయ్య.

"తెలివిని ఉపయోగిద్దాం, బలమును ప్రయోగిద్దాం. ఈ కట్టెలతోనే ఆ పుట్టను నేలమట్టం చేద్దాం" అన్నాడు సూర్యం ఆవేశంగా.

అందరూ పుట్టవద్దకు వెళ్ళారు. పుట్టను పడగొట్టడానికి కట్టెలు పైకెత్తారు.

"సూర్యం! నీ భార్య......" పరుగెత్తుకొని వచ్చిన భూమరాజం ఏదో చెప్పబోయి ఆగాడు.

కట్టెలు దించి అందరూ భూమరాజం వైపు చూశారు.

"సూర్యం భార్యకేమయింది?" తేరుకొని అడిగాడు జగదీశ్వర్.

కుడిచేతిలో పట్టుకొని వున్న కాగిదాన్ని అందరికీ చూపిస్తూ

ఆవేశంగా చెప్పాడు భూమరాజం "ముత్యంరావు దొర......ఛీ! అతణ్ణి దొర అన్నానేమిటి? ఇకముందు మనం ఎవరినీ "దొర" అని పిల్వకూడదు. మనల్ని "రారా!" "పోరా!" అంటే ఊర్కోకూడదు. మనం అణిగి మణిగి ఉన్నంతకాలం వీళ్ళు ఇలా దౌర్జన్యం చేస్తూనే వుంటారు......"

"అసలు సూర్యం భార్యకేమయిందో చెప్పు మామా!" శంకరయ్య అడిగాడు.

"ముత్యంరావు తన ఇంట్లో ఏదో పనివుందని కబురుచేస్తే సుజాత వెళ్ళిందట. ముత్యంరావు ఆమెను గదిలో బంధించి..." చెప్తున్న భూమరాజం వస్తున్న కన్నీళ్ళను తుడుచుకొన్నాడు. "ఆ అవమానం భరించలేక బావిలో పడి చనిపోయిందామె. ఇది ఆమె ఆత్మహత్య చేసుకునేముందు వ్రాసిన ఉత్తరం......... పదండి.. ...... రంగమ్మ, రాజయ్య, సుందరమ్మ, సుజాతల మరణాలకు కారకుడైన విషపూరిత మనస్తత్వంగల ముత్యంరావు పనిబడుదాం. దగాచేసే మనస్తత్వం దోపిడీ చేసే మనస్తత్వం దౌర్జన్యపూరిత మనస్తత్వం గల ముత్యంరావు లాంటి వాళ్ళందరినీ అణచివెయ్యాలి. దోపిడీలు, దౌర్జన్యాలు కొనసాగుటకు వీలులేని సమాజాన్ని మనం నిర్మించుకోవాలి......" అతడింకా ఏదో చెప్పబోతుండగా పుట్టనుండి పాము బయటకు వస్తూ కనబడింది.

చంద్రియ్య మెరుపులా కట్టెపైకెత్తి దాని పడగపైకొట్టాడు. ఒకే ఒక్క దెబ్బకు పాము ప్రాణం ఎగిరిపోయింది.

" పదండి ఇలాగే ఆ ముత్యంరావు పనికూడా పడుదాం " అన్నాడు సూర్యం.

అందరూ ఆవేశంగా ముత్యంరావు భవనం వైపు వెళ్ళిపో యారు.

ఆరోజు రాధమ్మ బలవంతం మీద పూజచేయడానికి పూజా ద్రవ్యాలు పట్టుకొని పుట్టవద్దకు వచ్చాడు మారుతి అక్కడ చచ్చి పడివున్న పామును చూచి బెదిరిపోయాడు.

"సరితను కాటేసిన పాము—సరిత ప్రాణాలను తీసేసిన పాము— ..దీనికేనా ఇన్నాళ్లూ తను పూజ చేసింది——ఇది నివసిస్తున్న పుట్టకేనా ఇన్నాళ్లూ తను పూజచేసింది——" ఆలో చనలో పడ్డాడు మారుతి

"పుట్టలకు పూజచేయడం అజ్ఞానం—విషసర్పాలకు పూజ చేయడమెందుకు?" అంటాడు మాష్టారు "పుట్టలకు పూజ చేస్తే పుణ్యం వస్తుంది" అని తల్లి అంటుంది. తాను ఇంతదూరం రాలేక మారుతిని బలవంతం చేసి పంపిస్తుంది.

తీవ్రంగా ఆలోచించినప్పుడు మాష్టారు మాటలే నచ్చుతాయి మారుతికి.

చంపబడిన నాగసర్పమును కాల్చివేస్తే పుణ్యం వస్తుందని ఎన్నోసార్లు చెప్పింది రాధమ్మ.

"చనిపోయిన ఏ ప్రాణి శరీరాన్నయినా కాల్చివేయడమో భూమిలో పూడ్చిపెట్టడమో చేయాలి" అంటాడు మాష్టారు. చనిపో యిన మనుషులనైతే శ్రద్ధతీసుకొని కాల్చివేస్తాం లేదా భూమిలో పూడ్చిపెడతాం. మిగతా ప్రాణులు చనిపోతే కనీసం భూమిలో పూడ్చిపెట్టడానికైనా శ్రద్ధతీకోసువడం లేదు. మన అశ్రద్ధ వల్ల శవాలు చెడిపోయి వాతావరణం కలుషితం అవుతుంది.

అతడు పూజాద్రవ్యాలున్న పళ్లెమును ఏపుగా పెరిగిన గడ్డిమీద పెట్టి కట్టెపుల్లలు ఏరితెచ్చాడు వాటిని ఒకచోట పేర్చి అందులో పాము శవాన్ని పడేసి అగ్గిపెట్టె కొరకు పళ్ళెమువద్దకు వచ్చాడు. పిట్టలు ఆ పళ్ళెములో వున్న అక్షతలను బుక్కుతూ కూర్చున్నాయి. మారుతి దగ్గరకు రాగానే ఎగిరిపోయాయి. అతడా అక్షతలను పిట్టలు బుక్కడానికి అనుకూలంగా బండమీదపోసి అగ్గిపెట్టె పట్టుకవెళ్ళి పాము శవాన్ని కాల్చివేశాడు.

మారుతి ఇంటికి రాగానే అన్నాడు "అమ్మా! మనం పూజ చేసే పుట్టలోని పామును చంపేశారు"

"ఎవరుచంపారు? అందులో పాము వుండేదా?" భుజాలు ఎగరవేస్తూ అంది రాధమ్మ.

"ఉండకపోతే ఎలా చంపుతారే.. ....ఇక ముందెప్పుడూ నేను పుట్టలకు పూజ చెయ్యనే అమ్మా! ఎప్పుడూ నన్ను బల వంతం చేయకేం"

# 8

ఆ డ్రామాలో శ్రీ కృష్ణుని పాత్రకు డైలాగులు చాలా తక్కువగా వున్నాయి ఆ పాత్రకు మారుతిని ఎన్నుకున్నారు. మారుతి కాస్త ఉత్సాహంగానే ఒప్పుకున్నాడు.

వేషాలకోసం రంగులు తెచ్చారు. శ్రీ కృష్ణుని వేషానికి అవసరమైన నీలిరంగు తెచ్చేసందర్భంలో ఎక్కడో పడిపోయింది అది ఎవ్వరూ గమనించలేదు.

నాటకం నడుస్తూ వుంది.

"మరో అరగంటలో నీపాత్ర కూడా వస్తుంది వేషం

వేసుకుందువురా'' అన్నాడు మేకప్ మాస్టర్.

మారుతి మేకప్ రూముకు వచ్చాడు. నీలిరంగుకోసం వెద కితే కనబడలేదు. మేకప్ మాస్టర్ హెడ్ మాస్టర్ గారికి విషయం చెప్పాడు. హెడ్‌మాస్టర్ కాస్త విసుగుతో అన్నాడు'' ఇప్పుడేం చేద్దాం?''

'' బొగ్గు పుయ్యండి సార్'' అన్నాడు అక్కడ నిలబడిన ఓ పదవ తరగతి విద్యార్థి.

''అలాచేస్తే బాగానేవుంటుంది కానీ జ్ఞాపకం లేక ముట్టు కున్నా దురద పెట్టినప్పుడు గోక్కున్నా ముఖం, చేతులు వికారంగా తయారవుతాయి'' అన్నాడు మరో విద్యార్థి.

'' పొటాషియం పెర్మాంగనేటుగో నీటి చుక్కలు వేసి ముఖానికి పుయ్యండి. కృష్ణుని వేషం చక్కగా కుదరడమే కాకుండా తుడిచినాపోదు'' అన్నాడు పొటాషియం పెర్మాంగనేటు ధర్మాలు జాపకం వున్న ఒక విద్యార్థి

హెడ్‌మాస్టర్ ప్యూన్‌ను పిలిచి సైన్సు మాస్టర్ దగ్గర వున్న ల్యాబ్ తాళపు చెవులు తెమ్మన్నాడు

సైన్సు మాస్టారుకు డ్రామాలంటే చాలా ఇష్టం. అతడు స్టేజీ ముందు కూర్చుండి డ్రామా చూస్తున్నాడు.

ప్యూన్ అయిదు నిమిషాల తర్వాత తాళపుచెవులు తెచ్చాడు. మేకప్ మాస్టర్ ల్యాబ్‌కువెళ్ళి పొటాషియం పెర్మాంగనేటు తెచ్చాడు మారుతి ముఖానికి పూశాడు. మారుతి వికృతంగా ముఖం పెట్టాడు.

స్టేజీ మీదికి వెళ్ళాక అతడు ముఖం చిట్లించడం ప్రారం

భించాడు. ప్రేక్షకులు కేకలు వేశారు. మారుతి డైలాగులు చెప్పడం మరచిపోయి "అల్లరి చేయకండి......అల్లరి చేయకండి'' అన్నాడు.

"నువ్వు ముందు అల్లరి చేయకుండా స్టేజీ మీది నుండి వెళ్ళిపో" అన్నారు కొందరు కొంటె పిల్లలు.

"ఇంకో నాలుగు డైలాగులున్నాయి. అవి..........''

"మారుతీ! ప్రేక్షకులతో మాట్లాడకు'' అన్నాడు భీముని వేషం వేసిన విద్యార్థి అది విన్న ప్రేక్షకులు గొల్లున నవ్వారు.

నాటకానికి దర్శకత్వం వహిస్తున్న మాస్టారు పరదా కిందికి వేయించి స్టేజీ మీదికి వచ్చి విద్యార్థి నటులకు ఏవో కొన్ని సూచనలిచ్చాడు. మళ్ళీ పరదా పైకి లేచింది.

ఎలాగైతేనేం డ్రామా పూర్తయింది.

మారుతి కూడా అందరిలాగే కొబ్బరినూనె ముఖానికి పూసుకొని తుడుచుకున్నాడు రంగుపోలేదు. సబ్బు పెట్టి కడుక్కున్నాడు. అయినా రంగుపోలేదు.

ఈ విషయం సైన్సు మాస్టారుకు తెలిసింది. "ఛ ఛ ఎంత పని చేశారోయ్ ఆ రంగుపోవడానికి కనీసం రెండు మూడు రోజులైనా పడుతుంది. బలవంతంగా రంగును పోగొట్టుకోవాలని ప్రయత్నిస్తే బొబ్బలెక్కుతాయి'' అన్నాడు

"అయితే మాస్టారూ! నన్ను ఈ ముఖంతోనే ఇంటికి వెళ్ళమంటారా? ఇలా గనుక వెళ్తే మా అమ్మ అన్నం వడ్డించదు. తిట్లు వడ్డిస్తుంది''

"అయితే ఇప్పుడేం చెయ్యమంటావు. నాముఖం ఇవ్వ

మంటావా?'' అన్నాడు మేకప్ మాస్టర్

అక్కడ వున్న వారందరూ గొల్లున నవ్వారు.

మారుతి తలనిండా బట్ట కప్పుకొని ఇంటివైపు పరుగు తీశాడు.

# 9

ఆ రోజు ఆదివారం.

ఎనిమిదవ తరగతి విద్యార్థులంతా కలసి మానేరు నదివద్దకు పిక్నిక్కు వచ్చారు అక్కడికి దగ్గరలోనే గుట్టవుంది. దాని పై భాగాన చిన్న చిన్న చెట్లున్నాయి. దాని పరిసర ప్రాంతాల్లో వివిధరకాల చెట్లున్నాయి అక్కడి దృశ్యాలు కనుల కింపుగా వున్నాయి. చల్లని ఆ ప్రశాంతమైన వాతావరణంలోకి రాగానే విద్యార్థులందరికీ ఎంతో హాయి అనిపించింది. వారిలో కొందరు కబడ్డి ఆడసాగారు. కొందరు కోతికొమ్మ ఆడసాగారు ఇద్దరు విద్యార్థులు వేపచెట్టు క్రింద కూర్చుండి చదరంగం ఆడసాగారు. ఇంకో ఇద్దరు విద్యార్థులు మర్రిచెట్టు క్రింద కూర్చుండి పులి జూదం ఆడసాగారు మరో ఇద్దరు విద్యార్థులు ఓన గుంటలు ఆడ సాగారు. ఒక విద్యార్థి గుండుపై కూర్చుండి డిటెక్టివ్ నవల చదవ సాగాడు కొందరు విద్యార్థులు ఆటలాడేవాళ్ళను చూడసాగారు.

మారుతి కబడ్డి ఆటలో పాల్గొన్నాడు. అతడు కబడ్డి, కబడ్డి అంటూ డ్యాన్సుచేస్తూ సరికొత్త విధానంలో ఆడాడు. తని ఆటను చూస్తున్న వాళ్ళంతా నవ్వారు. కబడ్డి ఆటలో ఓడిపోయిన తర్వాత అతడు చదరంగం ఆడేవాళ్ళ దగ్గరకు వచ్చాడు చదరంగం అనే

ఆట ఒకటి వుంటుందని కూడా అతనికి ఇంతవరకు తెలియదు.

"ఒకవైపు నల్లనికాయలు, ఒకవైపు తెల్లని కాయలు ఎందుకు పెట్టారు? కాయలన్నీ ఒకే విధంగా లేవేమిటి?'' అంటూ చదరంగం ఆడేవాళ్ళను ప్రశ్నించాడతడు.

ఒక ఆటగాడు ఆయాకాయలను చూపిస్తూ "ఇవి ఏనుగులు ఇవి గుర్రములు, ఇవి ఒంటెలు, ఇవి సైనికులు.........'' అంటూ చెప్పాడు. అవి నడిచే విధానం, ఆట నియమాలు కూడా చెప్పాడు.

అతడు అడిగిన ప్రశ్నలనే మళ్ళీ మళ్ళీ అడిగాడు. ఆటగాళ్లు విసుక్కున్నారు. మారుతి చిన్నబోయి అన్నాడు "మీరు ఈ కట్టె ముక్కలను చూపించి గుర్రములనీ, ఏనుగులనీ, ఒంటెలని చెప్పినంత మాత్రముననే నమ్మునంత తెలివి తక్కువవాడను కాను ఈ గుర్రములు వడిగా పరుగెత్తగలవా? ఈ ఒంటెలు ఎడారులలో ప్రయాణం చేయగలవా? నేను తెలివి తక్కువ వాడనని మీరు భావిస్తున్నారేమో! కాని అర్థం పర్థం లేని ఇలాంటి పిచ్చి ఆట ఆడే మీరే తెలివి తక్కువ వాళ్ళు''

వాళ్ళు ఆటలో నిమగ్నమై యుండుటవల్ల మారుతి మాటలను పట్టించుకోలేదు. తర్వాత అతడు పులిజూదం ఆడేవాళ్ళ దగ్గరకు వెళ్లాడు. వాళ్ళు భూమి మీద గీతలుగీసి రాళ్ళను మేకలుగా గూన పెంకలను పులులుగా పెట్టి ఆడుతున్నారు.

అతనికి పులిజూదం ఆట ఏమాత్రం అర్థం కాలేదు. అతడు వాళ్ళ మీద కూడా అనేక ప్రశ్నలు వేశాడు. వాళ్ళు సమాధానం చెప్పారు.

" రాళ్ళను మేకలుగానూ, గూన పెంకలను పులులుగానూ భావించునంతటి తెలివితక్కువ వాడనుకాను'' అన్నాడు. వాళ్ళు మాట్లాడలేదు దాహం వేయడంతో మారుతి నీళ్ళకోసం బయలు దేరాడు.

ఒకచోట ఊట నీరు కన్పించింది అతడా నీటి దగ్గరకు నడుస్తుండగా కాలు జారి క్రింద పడ్డాడు. ఆశబ్దం విని ప్రక్కనే వున్న పొదలో నుండి కుందేలు పరుగెత్త సాగింది. మారుతి లేచి బట్టలు దులుపుకొని పరుగెత్తుతున్న కుందేలును చూచి వికృతంగా అరచాడు. అతని అరపులు విని కుందేలు మరింత వేగంగా పరుగెత్తి కనుమరుగయింది. అతడు ఊట నీరు త్రాగక స్నేహితుల వద్దకు నడవసాగాడు. దారిలో ఒకచోట గుండు మీద కోతి కూర్చుండి వుంది. అతడు దానివైపు రాయి విసిరాడు. కోతి కోపంతో పరుగెత్తి వచ్చి అతని అంగీ చింపేసింది. అతడు భయంతో కేకలు వేశాడు కోతి గంతులు వేస్తూ పరుగుతీసింది.

మారుతి చినిగిన చొక్కాను చూచి స్నేహితులు అడిగారు ,,అంగి ఎలా చినిగింది?''

మారుతి జరిగిందంతా చెప్పాడు.

" నీది ఆకోతిది ఒక్కజాతేనోయి. అది నిన్ను ప్రేమించి నట్టుంది అందుకే నీతో సరసాలాడింది. ప్రేమించిన ఆకోతినే పెళ్ళిచేసుకో కాయలూ, పండ్లూ తినచ్చు చెట్టుమీద కాపురం చేయచ్చు'' అన్నాడొక విద్యార్థి మిగతా విద్యార్థులు నవ్వుతూ మారుతి చుట్టు తిరుగుతూ చప్పట్లు కొడుతూ మారుతిని హేళన చేస్తూ పాటలు పాడారు.

"టిఫిన్లు తిందాం పదండి'' అన్నాడొక విద్యార్థి. విద్యార్థులంతా టిఫిన్ డబ్బాలు పట్టుకొని నదివైపు బయలుదేరారు. మారుతి అందరికంటే వెనుక నడుస్తున్నాడు. దారిలో ఒకచోట బావివుంది. అతడా బావి దగ్గరకు రాగానే ఓ జీవి బావిలో దూకింది. అదిచూచి ఆతడు "బావిలో టైగర్ దూకింది. బావిలో టైగర్ దూకింది'' అంటూ కేకలు వేశాడు.

ఇద్దరు పిరికివాళ్ళు భయంతో చాలాదూరం పరుగెత్తారు. కొంత మంది బావిలోపడిన టైగర్ తమనేమి చేయదని భావించి బావి వద్దకే పరుగెత్తి వచ్చారు. అందరూ బావిలోకి తొంగి చూశారు. వాళ్ళకు టైగర్ కనబడలేదు. కాని చేపలు, కప్పలు, పురుగులు మాత్రం కనబడ్డాయి.

"టైగరేది?'' అన్నారు మిత్రులు మారుతి ముఖంలోకి బావిలోకి మార్చి మార్చి చూస్తూ.

మారుతి చూపుడు వేలితో చూపించాడు. అతడు చూపించిన ప్రాంతములో పెద్ద కప్పవుంది. కాని టైగర్ లేదు.

"మారుతీ! నువ్వు టైగరంటున్నది ఆకప్పనేనా?'' అంటూ ప్రశ్నించాడొక విద్యార్థి

"అవును ఇంగ్లీషులో కప్పను టైగరేగా అనేది'' అన్నాడు మారుతి.

"కప్పను ఇంగ్లీషులో ఫ్రాగ్ అంటారోయ్, టైగరంటే పెద్దపులి. నీ తెలివి మండిపోను ఒక్కొక్క తరగతిని రెండేసి మూడేసి సంవత్సరాలు చదువుతున్నావు. కప్పను ఇంగ్లీషులో ఏమంటారో తెలియదా?'' అంటూ చీవాట్లు పెట్టాడు ఒకమిత్రుడు.

అందరూ ఇసుక తెప్పమీద కూర్చొంది టిఫిన్లు తినడం ప్రారంభించారు.

మారుతి బజ్జీల పొట్లం విప్పి నేలమీద పెట్టి గుట్ట మీది చెట్లను చూస్తూ ఒక్కొక్క బజ్జీనే నోట్లో వేసుకొని నమిలి మ్రింగసాగాడు ఒక కప్ప గంతులు వేస్తూ వచ్చి బజ్జీలపై దుమికి కూర్చుంది. అతడు బజ్జీ కొరకు చేయి పెట్టగానే కప్ప అందింది. పరధ్యానలో వున్న అతడు దానిని నోట్లో వేసుకున్నాడు. అది వెనువెంటనే బయటకు దూకింది మారుతి క్రింద దూకిన కప్ప వైపు చూశాడు మిత్రులు గొల్లున నవ్వారు మారుతి వాళ్ళ వైపు చూస్తూ కోపంతో అన్నాడు "నా బజ్జీలపైన కప్ప నెవరు పెట్టారోయ్"

"కప్పకు కాళ్ళున్నాయోయ్. అదే వచ్చి నీబజ్జీల మీద కూర్చుందోయ్. తమరు పరధ్యానలో దానినే నోట్లో వేసుకున్నారు" ఒక మిత్రుడు అభినయిస్తూ చెప్పాడు మారుతి మాట్లాడలేదు.

టిఫిన్లు తినడం ముగిసిన తర్వాత అందరూ ఇంటి దారి పట్టారు

మారుతి షర్టు మాసిపోయి వుండడమే కాకుండా చినిగి పోయి కూడా వుండడంతో రాధమ్మ అతనిని రకరకాల తిట్లతో దీవించింది

# 10

రామశర్మ మాస్టారుకు ట్రాన్సుఫర్ అయింది.

అతడు ఆవూరి నుండి బదిలీచేయించుకొని వెళ్ళిపోవడానికి

చాలా తొందరపడ్డాడు. ఆఫీసర్ గారింటికి వెళ్లాడు. అతనిని బ్రతిమాలి బామాలి రూపాయల నోట్లు అతనిచేతిలోపెట్టి బదిలీ చేయించుకున్నాడు. అతడు అంత తొందరపడి బదిలీ చేయించుకోవడానికి కారణం తెలుసుకోవాలంటే అతని కథ తెలుసుకోవాల్సిందే. ఆకథ ఇది.—— ——

"సార్ నాకో నవల ఇస్తారా?'' అడిగింది హరిప్రియ.

"ఏ నవల కావాలి నీకు?'' అడిగాడు లైబ్రరీ మాస్టారు రామశర్మ

"విశ్వనాథ సత్యనారాయణగారి, చెలియలికట్ట" చెప్పింది. హరిప్రియ.

"సరే వెదకిఉంచుతాను. సాయంత్రం మూడవ పీరియడ్‌లో వచ్చి తీసుకపో''

రామశర్మ చెప్పినట్టే హరిప్రియ మూడవ పీరియడ్‌లో రామశర్మ వద్దకు వచ్చింది. అతడిచ్చిన పుస్తకం తీసుకొని రిజిష్టర్‌లో సంతకం చేసి ఇంటికి వెళ్ళిపోయింది.

రాత్రి భోజనమైన తర్వాత పుస్తకం తెరచింది. పుస్తకములో ఏదో వ్రాసిన కాగితం కనిపించింది. ఆమె ఆసక్తితో ఆ కాగితం విప్పి చదివింది. అందులో ఇలా వుంది.

ప్రియమైన నా హరిప్రియకు ప్రేమతో వ్రాయు ప్రేమలేఖ ——ప్రియా! నిన్ను గాఢంగా ప్రేమించాను. దేవదాసు పార్వతిని ఎంత ప్రేమించాడో అంత ప్రేమించాను. గులాబీ పువ్వు లాంటి నీ శరీరాన్ని నాశరీరానికి హత్తుకోవాలని వుంది. ఆలాంటి అవకాశం కల్పిస్తావని ఆశిస్తున్నాను. నీవు ఎదిగిన ఆడ

పిల్లవు. నేను ఒంటరివాణ్ని మనమిద్దరం జంటైతే చాలా బాగుంటుందని నా నమ్మకం నీకిష్టమైతే రేపు సాయంకాలం ఏటి ఒడ్డున వున్న దేవాలయం చెంతకురా. వస్తావుకదూ!

నీకోసం నిరీక్షించే

నీ ప్రియమైన రామశర్మ

హరిప్రియ ఆలోచనలో పడింది.

రామశర్మ అవివాహితుడు, అందగాడు, ఉద్యోగస్తుడు అతనికి భార్యనైతే జీవితం......అలా ఆమె రాత్రింతా చాలా సేపు ఆలోచించి నిద్రపోయింది.——

ఆమెకు రామశర్మ కనిపించినట్లు, ప్రేమతో పలుకరించినట్లు, ఏటి ఒడ్డున కూర్చుండి మాట్లాడుకున్నట్లు, దేవాలయింలో పూలదండలు మార్చుకున్నట్లు...... శోభనం గదిలో అతనితో అలా———అలా కలవచ్చింది.

మరునాడు ఉదయం ఆమె రామశర్మకు ఉత్తరం రాసింది.

ప్రియమైన రామశర్మ మాస్టారూ! మీలేఖ చదివాను. ఒక ఉపాధ్యాయుడు తన శిష్యురాల్ని పెళ్ళిచేసుకోవడం చాలా అరుదుగా జరిగే సంఘటన. మిమ్ములను హృదయ పూర్వకంగా ప్రేమిస్తున్నాను. మీరు కోరినట్లు ఈరోజే దేవాలయం చెంతకు రాగలను.

ప్రేమతో——

మీ హరిప్రియ

ఉత్తరం పుస్తకములో పెట్టి రామశర్మకు ఇచ్చింది. అతడా లేఖను రహస్య ప్రదేశములో చదువుకొని ఆనందించాడు.

సాయంకాలం ఆరుగంటల తర్వాత ఇద్దరూ దేవాలయం చెంత కలుసుకున్నారు ఏటి ఒడ్డున నడుస్తూ చాలా దూరం వెళ్లారు. ఏరు గలగలా ప్రవహిస్తూవుంది. చల్లని గాలి వీస్తూవుంది ఇద్దరూ ఓ చోట ఇసుకలో కూర్చున్నారు చిలిపిగా మాట్లాడుకున్నారు కొంటెగా చూచుకున్నారు. రతీమన్మధులవలె విహరించారు.

మరునాడామె రామశర్మ విషయం తండ్రికి చెప్పింది. ఆయన మొదట ఆశ్చర్యపోయాడు. తేరుకొని అన్నాడు "రామశర్మ మాస్టారు నిన్ను పెళ్ళి చేసుకుంటాడన్న నమ్మకం నీకుందా?''

నమ్మకముందన్నట్టు తల ఊపింది హరిప్రియ.

అతడు పెళ్ళిళ్ళ గౌరయ్యను రామశర్మ వద్దకు పంపాడు.

రామశర్మ హరిప్రియను పెళ్ళాడడానికి అసమ్మతిని తెలియ జేస్తూ అన్న విషయం "గౌరయ్యగారూ! మనలో మనమాట హరి ప్రియ పతిత పెళ్ళికాక పూర్వమే ఒక ఉపాధ్యాయునితో——— నేను కళ్లారా చూశాను'' అన్నాడు.

గౌరయ్య మౌనంగా వెళ్ళిపోయాడు.

రామశర్మ తనలో తాను నవ్వుకొని తండ్రి రాసిన ఉత్తరాన్ని మరోసారి చదవసాగాడు

" ప్రియమైన రామశర్మకు దీవించి వ్రాయునది. నీఉత్తరం అందింది నీవు ప్రేమించిన అమ్మాయి తండ్రి నా చిన్ననాటి మిత్రుడే అపూర్ ఫెలో పాతికవేలు వరకట్నం ఇవ్వగలడా? మొన్ననే నిజామాబాద్ నుండి నీకో సంబంధం వచ్చింది. నేను వెళ్ళి అమ్మాయిని చూశాను ఆమె రత్నంలా వుంది వరకట్నం పదివేలు. ఆదివారంనాడు అమ్మాయిని చూడడానికి నిజామాబాద్‌కు

రా అమ్మా నేను వస్తున్నాం ..... నీ క్షేమంకోరే తండ్రి

పరంధామశర్మ

ఉత్తరం చదువుకొని మనసులో ఇలా అనుకున్నాడతడు.

''హరిప్రియ తండ్రి రెండు వేలైనా ఇవ్వగలడా?''

*　　　　*　　　　*

నిజామాబాద్‌కు వెళ్ళివచ్చిన రామశర్మకు గుండె దడ కలిగించే విషయం అతని సన్నిహిత మిత్రుని ద్వారా తెలిసింది

హరిప్రియ అన్నయ్య రౌడీలను అణచివేయడంలో మొనగాడట అతడు వరంగల్ కాలేజీలో చదువుతున్నాడట అతనికి గనుక ఈ విషయం తెలిస్తే తప్పనిసరిగా వచ్చి దేహశుద్ధి చేస్తాడట.

అందుకే అతడు అంత తొందరపడి బదిలీ చేయించుకున్నాడు.

రామశర్మను వీడ్కోలు చేయడానికి సమావేశం ఏర్పాటు చేయబడింది. అతనిని పొగడుతూ కొందరు విద్యార్థులు ఉపన్యసించారు.

మారుతి ఉపన్యసించడానికి వేదిక మీదికి వచ్చాడు. "అ—అ—అధ్యచ్ఛ మహాశయా! రామశర్మ——గారు బదిలీఅయి వెళ్ళిపోతున్నందుకు సంతోషిస్తున్నాను. ఆయనగారు నన్ను పదేపదే తిడుతూ వుండేవారు. కొడుతూ వుండేవారు అలాంటి మాష్టారు పోతున్నప్పుడు నాలాంటి విద్యార్థులు సంతోషించడంలో తప్పులేదని భావిస్తున్నాను. కొందరు టీచర్లు విద్యార్థులను తిట్టరు, కొట్టరు పాఠాలు చెప్పుకుంటూపోతారు మరికొందరు

మేష్టర్లు విద్యార్థులను తిట్టడం గానీ పాఠాలు చెప్పి వాళ్ళ బుర్రలు చెడగొట్టడం గానీ చేయరు మౌనంగా కూర్చుండడమో టేబుల్‌మీద తలపెట్టి నిద్రపోవడమో చేస్తుంటారు. చివరి సారిగా రామశర్మగారు నన్ను మరచిపోవద్దని, సుఖసంతోషాలతో జీవించాలని కోరుకుంటూ ముగిస్తున్నాను.

అతడు ఉపన్యాసం ఇస్తుండగా కొందరు విద్యార్థులు అతనిని వేదిక మీది నుండి దిగి రమ్మని సైగ చేశారు. రామశర్మగారి ముఖం వెల వెల పోయింది.

తదుపరి కొంతమంది విద్యార్థులు రామశర్మ మాస్టారును పొగడుతూ ఉపన్యసించారు. అప్పుడు అతని ముఖం కొంత వికసించింది.

విద్యార్థులు రామశర్మ మాస్టారుకు పూలమాలలు వేసి బహుమతులు ఇచ్చారు ప్రధానోపాధ్యాయుడు రామశర్మ మాస్టారును పొగడుతూ నాలుగు మాటలు మాట్లాడాడు తదనంతరం రామశర్మ మాస్టారు ఉపన్యసించాడు.

# 11

ఆనాడు ఆదివారం

వామనశర్మ గదిలో కూర్చుండి ''వరకట్నం తెచ్చిన విషాదం'' అనే కథ వ్రాస్తున్నాడు. అతడు రామశర్మ స్థానంలో ఈవూరికి వచ్చాడు. రాధమ్మ ఇంట్లోనే వుంటున్నాడు.

ఇంతకు పూర్వం రాధమ్మ ఎందుకోగానీ లలితను తిట్టింది. అప్పటి నుండి అతనికి లలిత ఏడ్పు విన్పిస్తూనే వుంది. అతడు

వ్రాయడం ఆపేసి కాగితాలను టేబుల్ మీద పడేసి లలిత దగ్గరకు వచ్చాడు. ఆమె అటుపైపు ముఖంపెట్టి ఏడుస్తూవుంది అతడు కొంచెం సేపు మౌనంగా నిలబడ్డ తర్వాత "లలితా!" అన్నాడు

ఆమె ఒక్కసారి ఉలిక్కిపడింది. గబగబా కళ్ళు తుడుచుకొని వామనశర్మ వైపు తిరిగి చూచింది.

"ఎందుకు ఏడుస్తున్నావు లలితా!" అన్నాడు వామనశర్మ ఆయన మాటల్లో ఆప్యాయత మిళితమై వుంది.

లలిత మాట్లాడలేదు

అతడు మళ్ళీ అన్నాడు "చెప్పు లలితా"

"——... .. ——"

"సందేహిస్తావెందుకు లలితా? చెప్పు"

ఆమె కొద్ది రోజుల నుండి వామనశర్మ వద్ద పుస్తకాలు అడుక్కొని చదువుతూవుంది వాళ్ళిద్దరి మధ్య స్నేహభావం ఏర్పడి వుంది.

లలిత చెప్పసాగింది

జానకి అని నా స్నేహితురాలు చలంగారి పుస్తకాలు బాగుంటాయని చెప్పింది ఆయన పుస్తకాలు చదువుతూవుంటే ఏదోశక్తి వచ్చినట్టే వుంటుందట ఉదయం ఆ వరండాలో కూర్చుండి చలంగారి మైదానం చదువుతుండగా వనజాక్షమ్మ పెద్దకొడుకు వచ్చాడు. నేను ఆ పుస్తకాన్ని అక్కడే పడేసి ఇంటి వెనుకకు వెళ్ళిపోయాను. ఆయన మా అమ్మకు ఏంచెప్పాడో కాని అమ్మ ఆ పుస్తకాన్ని ఎక్కడో దాచేసింది దాని కోసం నేను వెదకుతుండగా అమ్మ చూచింది. చీవాట్లు పెట్టింది ఇష్టమైన పుస్తకాలు చదువుకోవడానికి

కూడా వీలులేని అధ్వాన్న పరిస్థితిలో బ్రతుకుతున్నాను. ఒక్కో-సారి ఇంత హీనంగా బ్రతికేకన్న చావేమేలనిపిస్తుంది.

"మీరు అలాంటి ఆలోచనలు ఎప్పుడూ పెట్టుకోకండి. చావు సమస్యలకు పరిష్కారం కానేకాదు''

మీరు వ్రాసిన "తెగింపు'' నవల చదివిన తర్వాత అందులో భర్త చనిపోయిన పార్వతి తన తల్లిదండ్రుల నెదిరించి వాళ్ళను వదిలేసి తనకు నచ్చిన వ్యక్తితో ఎలావెళ్ళిపోయిందో నాకూ అలా వెళ్ళిపోవాలనిపిస్తుంది. కాని ఎవరితో వెళ్ళాలి. నాకు నచ్చిన వ్యక్తిగానీ, నన్ను మెచ్చిన వ్యక్తిగానీ ఎడీ? అది అలా వుండనీ కనీసం నాకు ఇష్టమైన పుస్తకాలు చదువుకునే అవకాశం కూడా లేదు. నా మనస్సు ఎంత క్షోభిస్తుందో ఎవరికి అర్థమవుతుంది.

"అక్కా! దొరికింది దొరికింది'' అంటూ సంతోషంతో గంతులు వేస్తూ మారుతి వంటింటి గదిలో నుండి బయటకు వచ్చాడు

లలిత మారుతి ముఖంలోకి ఆశ్చర్యంతో చూస్తూ అంది "నువ్వు ఇంత సేపు ఇంట్లోనే వున్నావా?''

"పుస్తకం కోసం నువ్వు ఏడుస్తుంటే నాకుబాధ కలిగిందే అక్కా! చెప్పొద్దూ అమ్మ మీద కోపం కూడా వచ్చింది ఎవరో ఏదో చెప్పారని నువ్వు చదువుతున్న పుస్తకాన్ని లాక్కుంటుందా? అప్పటి నుండి వెదకుతూవుంటే ఇప్పుడు దొరికింది.''

"ఎక్కడ దొరికిందిరా?''

"అటుకుల డబ్బాలో''

మారుతి పుస్తకం అందించాడు లలితముఖం వికసించింది.

"మాస్టారూ! మాఅక్కకు పుస్తకాలు చదవడమంటే చాలా ఇష్టం. మీ దగ్గరవున్న పుస్తకాలు ఇస్తూ వుండండి." అన్నాడు

# 12

వనజాక్షమ్మ ఇంట్లో పెళ్ళి వుంది. రాధమ్మ వాళ్ళ ఇంట్లో వంటచేయడానికి ఉదయమే వెళ్ళింది ఇంకారాలేదు.

లలిత అతని గదిలోకి వచ్చింది. ఏదో వ్రాసుకుంటూ కూర్చున్న వామనశర్మ ఆమెను చూచి వ్రాయడం ఆపి అన్నాడు "రండి కూర్చోండి"

లలిత చాపమీద కూర్చుండి ఎప్పటినుండో అడగాలనుకున్న ప్రశ్న అడిగేసింది. "మీకు పెళ్ళి అయిందా?"

"అయింది"

"మీ భార్య——"

"చనిపోయింది" అతని ముఖంలో బాధ తొంగిచూచింది.

లలిత ఏదో అడగబోయింది. అదిగమనించిన వామనశర్మ 'వివరంగా చెప్తా వినండి' అంటూ ప్రారంభించి చెప్పసాగాడు.

" మానాన్న కష్టపడి పనిచేసేవాడు మత్తుగా తాగేవాడు, ఒకనాడు తప్పతాగి ఇంటికి వస్తూవుండగా దారి పక్కనవున్న బావిలో పడిపోయాడు. చాలా దెబ్బలు తగిలాయి ఆసుపత్రికి తీసుక వెళ్లాము డాక్టర్లు ఎంత ప్రయత్నం చేసినా బ్రతకలేక పోయాడు కొన్నాళ్ళ తదుపరి మా అమ్మను ఒక రౌడీ వెధవ బలాత్కరించాడు మా అమ్మ గూట్లోవున్న కొడవలి తీసి ఆదుర్మార్గుని వైపు విసిరింది. కొడవలి వాని గొంతులో దిగడం వల్ల

వాడు అక్కడికక్కడే చనిపోయాడు. వెంటనే మాఅమ్మ గన్నేరు చెట్టును పీకి దాని వేళ్ళను నమిలి మింగింది. కొన్ని గంటలలోనే ఆమె కూడా చనిపోయింది నేనప్పటికి పది సంవత్సరాల పిల్లవాణ్ణి. నన్ను మా చిన్నాన్న పెంచి పెద్దచేశాడు———నేను భోగం వసంతను ప్రేమించి పెళ్ళిచేసుకున్నాను. ఇరుగు పొరుగు బ్రాహ్మణులు నన్ను వెలివేశారు బ్రాహ్మణులంతా కలసి నన్ను ఊళ్లో నుండి వెడల గొట్టారు నేను ఊరు బయట ఇల్లు కట్టుకున్నాను. ఒకనాడు————''

మౌనం వహించిన వామనశర్మను చూచి అంది లలిత ''ఏమయింది? చెప్పండి''

వామనశర్మ ముఖం కోపంతోనూ, బాధతోనూ నిండిపోయి నట్టయింది అతడు మళ్ళీ చెప్పసాగాడు. ''నలుగురు బ్రాహ్మణ యువకులు నా ఇంటి వద్దకు వచ్చారు. తలుపు తట్టారు నేను తీశాను. వాళ్ళు నానోట్లో గుడ్డలు కుక్కారు నా భార్య ఎవరినైనా పిలుదామన్న ఉద్దేశంతో ఇంటి బయటకు పరుగెత్తబోయింది. వాళ్ళు ఆమెను ఆపేశారు. తలుపులు వేసేశారు నాముందే—— ఇక నేను చెప్పలేను'' అతడు కళ్ళు మూసుకున్నాడు.

లలిత అతని వద్దకు వెళ్ళి అతని తలమీద చేయి వేసి నిమురుతూ ఏమనాలో తోచనట్లుగా వుండిపోయింది.

వామనశర్మ భారమైన కంఠముతో మెల్లగా చెప్పాడు ''మరునాడు ఆసుపత్రిలో మరణించింది వసంత''

అతడు కొంచెంసేపు మౌనం వహించి మళ్ళీ చెప్పసాగాడు. ''మిత్రులు వసంతను ఆసుపత్రికి చేర్చడంలోనూ పోలీసులకు

రిపోర్టు ఇవ్వడంలోనూ సహకరించారు——కొన్ని కారణాల వల్ల నా నివాసం కరీంనగర్‌కు మార్చేశాను———"

కొంచెంసేపు మౌనంగా గడచిన తర్వాత లలిత వామన శర్మ ముఖంలోకి సూటిగా చూస్తూ అడిగింది "మీకు మళ్ళీ పెళ్లి చేసుకోవాలన్న అభిప్రాయం వుందా?"

"ఉంది"

లలిత కొంచెంసేపు మౌనం వహించి ఏదో ఆలోచించి అడిగింది "అమ్మాయి దొరికిందా?"

"దొరకలేదనే చెప్పాలి" నాకిప్పుడు 35 సంవత్సరాల వయస్సుంది. ఈ వయస్సులో నవయువ్వనురాలిని పెళ్ళిచేసుకుంటే నావల్ల ఆమె తృప్తి పొందకపోవచ్చు అందుకే నావయస్సుకు తగిన విధవను పెళ్ళిచేసుకోవాలనుకుంటున్నాను. ఒకసారి సంసార సుఖాన్ని అనుభవించిన పురుషుడు భార్య చనిపోతే భర్త చనిపోయిన స్త్రీని పెళ్ళిచేసుకుంటే సమంజసంగా వుంటుందని నా అభిప్రాయం. ముఖ్యంగా నన్ను ప్రేమించే స్త్రీనే పెళ్ళి చేసుకోవాలనుకుంటున్నాను"

"కొందరు మాటల్లో చాలా అభివృద్ధికరంగా కనిపిస్తారు. కాని ఆచరణకు వచ్చే సరికి జారుకుంటారు మరి——"

"మీరు నా విషయంలో మాత్రం అలా అనుకోకండి" ఇంకా ఏదో చెప్పబోయి ఆగిపోయాడు వామనశర్మ.

"మిమ్మల్ని సూటిగా ఓ విషయం అడగాలనుకుంటున్నాను అడగమంటారా?"

"అడగండి"

"నన్ను——నన్ను——పెళ్ళి చేసుకుంటారా?"

"మీకు ఇష్టమైతే తప్పకుండా చేసుకుంటాను"

"మిమ్మల్ని పెళ్ళి చేసుకుంటే సుఖపడతానన్న ఆశవుంది. ఇంతకు పూర్వం నాకు పెళ్ళి అయిందేకాని ఎప్పుడూ సుఖపడలేదు. అత్తచేత విధవ ఆడబిడ్డచేత మగనిచేత భరించరాని కష్టాలే అనుభవించాను. ఆయన తాగిన మైకంలో కారు క్రిందపడి చనిపోయాడు————భయంకరంగా గడచిపోయిన గత జీవితాన్ని వివరించి చెప్పడం కూడా నాకిష్టం లేదు" అని చెప్పి హఠాత్తుగా ఆమె ఇంటివెనుకకు వెళ్ళిపోయింది నాలుగైదు నిమిషాల తర్వాత పువ్వులు తెంపుకొని తిరిగి వచ్చింది. "ఇవి మీరు నా జడలో పెట్టండి" అంది

వామనశర్మ ఆ పువ్వులు తీసికొని ఆమె జడలో పెడుతుండగా మారుతి వచ్చాడు. అతడు ఆశ్చర్యంగా లలితను మాస్టారును చూస్తూ అన్నాడు "మాస్టారూ! మా అక్క పూలు ధరిస్తే బాగుంటుంది కదండీ"

అవునన్నట్టు తలవూపాడు మాస్టారు.

మారుతి కుంకుమ, గాజులు లలిత లోగడ ధరించిన నగలు తెచ్చి అన్నాడు "అక్కా! ఇవన్నీ నువ్వు ధరిస్తే చూడాలనివుందే"

"తమ్ముడూ! అందరూ నిన్ను తెలివితక్కువ వాడు అంటారు. కాని వాళ్ళు అనుకున్నంత తెలివితక్కువ వాడివికాదురా. ఈ అక్క ఎలాగైతే ఆనంద పడుతుందో తెలుసుకునే తెలివితేటలు నీకున్నాయిరా. నువ్వు చాలా మంచివాడివిరా తమ్ముడూ"

మారుతి నిర్మలంగా నవ్వాడు.

లలిత చేతికి గాజులు పెట్టుకుంటూ అడిగింది "ఇంత సేపు నువ్వు ఎక్కడకు వెళ్ళావురా?"

"చుక్కాయమ్మ ఇంటికి వెళ్ళాను"

"అమ్మ ఏం చేస్తుందక్కడ?"

"చుక్కాయమ్మతో మాట్లాడుతూ కూర్చుంది. నేను అక్కడకు వెళ్ళగానే నన్ను పక్కకు రమ్మని అక్కయ్య ఏంచేస్తుందో చూచిరా అంది" అన్నాడు. కొంచెం సేపు మౌనం వహించిన అతడు తిరిగి అన్నాడు "అక్కా! నేను తెలివితక్కువవాడనే అయినా అమ్మ అనుకున్నంత తెలివితక్కువవాడను కాను అమ్మ నన్ను ఇక్కడకు ఎందుకు తోలించిందో నాకు తెలుసు——" ఇంకా అతడు ఏదో చెప్పబోతుండగా రాధమ్మ అక్కడకు వచ్చేసింది

లలితను చూచి లబలబ మొత్తుకుంది "వితంతువులు అలంకరించుకోగూడదు. మనఆచారాల ననుసరించి ప్రవర్తించాలి" అంది

లలిత మాట్లాడలేదు.

రాధమ్మ లలిత దగ్గరకు వెళ్ళి ఆమె జడలోవున్న పూలమాలను లాగేయ బోయింది. మారుతి అడ్డుపడి అన్నాడు "అమ్మా! కన్నతల్లి వే అయినా అక్కయ్యను శాసించే అధికారం నీకు లేదు ....." అతడు ఇంకా ఏదో అనబోతుండగా రాధమ్మ వామనశర్మతో అంది "మాస్టారూ! చూశారా దాని బుద్దేమో పక్కదారి పట్టింది. ఈ బుద్ది తక్కువవాడేమో దానిని సమర్థిస్తున్నాడు వీళ్ళు ఎలా బాగుపడుతారో అర్థం కాకుండావుందయ్యా"

ఆమె తల పట్టుకొని ఏడ్వసాగింది.

# 13

ఆరోజు రాధమ్మ రాజ్యలక్ష్మి ఇంటికి గిన్నెడు పంచదార అప్పు ఇమ్మని వచ్చింది. రాజ్యలక్ష్మి రాధమ్మకు పంచదార ఇచ్చి డబ్బాకు మూత పెడుతుండగా లచ్చమ్మ పాలు తెచ్చింది.

రాజ్యలక్ష్మి పంచదార డబ్బా దాచేసి గ్లాసు పట్టుకొని వస్తూ అంది. "సాయంకాలం పావలా పాలు తీసుకరా"

"ఎందుకమ్మా?"

"రేపు తెల్లవారు జామున నాగదేవునికి పూజ చేయ్యాలి. అలా అయిదు ఆదివారాలు చెయ్యాలట. అలా చేస్తే....."

"ఎందుకమ్మాయిగారూ సిగ్గు పడుతున్నారు—చెప్పండి"

"పిల్లలు పుడుతారట"

రాధమ్మ కంగారు పడిపోతూ అంది "ఆదివారం నాడు నాగదేవునికి పూజచేస్తారటే! ఎవ్వరే అలా చెయ్యిమన్నది?"

"కనకమ్మ పిన్ని"

"గంపెడు పిల్లలగన్న కనకమ్మ చెప్పినట్టుచేస్తే గంపెడు పిల్లలను కనవచ్చని అనుకుంటున్నావేమో కానీ అలా చేస్తే గంపెడుకాదు, అరగంపెడుకాదు. పావుగంపెడుకాదు——...
ఒక్క పిల్లవాడు కూడా పుట్టడు"

"మరెలా రాధమ్మత్తా?——"

"చెప్తా విను" అంటూ మొదలుపెట్టి ఇలా చెప్పింది.
"మంగళవారం మొదలుకొని అయిదు రోజులు వరుసగా నాగదేవు

నికి పూజ చెయ్యాలి. పూజ ఎలా చెయ్యాలో కూడా చెప్తాను విను——————నాలుగు గంటల రాత్రి లేచి భార్యాభర్త లిద్దరూ చన్నీటి స్నానం చేసి తడిబట్టలతో పుట్ట వద్దకు వెళ్ళాలి. పుట్ట ముందు మంచినీళ్ళు చల్లి పుట్టను పసుపు కుంకుమలతో పూజించి అగరువత్తులు వెలిగించి పుట్ట చుట్టు అయిదుసార్లు ప్రదక్షిణలుచేసి ఆ తర్వాత పుట్టలో పాలు పొయ్యాలి......చివరిరోజు పూజ చేసి కొబ్బరికాయ కొట్టి ఆ ముక్కలను అక్కడే వదిలిపెట్టి వెనుకకు చూడకుండా ఇంటికి రావాలి''

"ఇదంతా నీకు ఎవరు చెప్పారు రాధమ్మత్తా?''

''దయ్యాలను..... భూతాలను సీసాల్లో బంధించగలిగే మాంత్రికుడు————ఇలా చేసిన గొల్ల మల్లమ్మకు బంగారంలాంటి కొడుకు పుట్టాడు''

''నిజంగానా రాధమ్మత్తా?"

"నిజమేనే ''

''అలా అయితే నువ్వు చెప్పినట్టే చేస్తాను పూజా విధానం మరొక్కసారి చెప్పు''

ఆమె పూజా విధానం మరోసారి చెప్పి వెళ్ళిపోయింది.

రాజ్యలక్ష్మి భర్తనుద్దేశించి అంది ''రాధమత్త చెప్పింది విన్నారా?''

''విన్నాను''

''కనకమ్మ పిన్ని చెప్పిన పూజా విధానం కూడా చెప్తాను వినండి'' అంటూ మొదలు పెట్టి ఆమె చెప్పిందంతా చెప్పి తర్వాత అడిగింది ''కనకమ్మ పిన్ని చెప్పినట్టు చేద్దామా? లేక

రాధమ్మత్త చెప్పినట్టు చేద్దామా?"

,,నీవో అజ్ఞానివి కనకమ్మత్త నీకంటే గొప్పఅజ్ఞాని రాధమ్మపిన్ని కత్తిలేని అజ్ఞాని'' అన్నాడు కృష్ణమూర్తి.

,, అబ్బ మీబోడి వాదం కట్టిపెట్టి ఏదో ఒకటి చెప్పండి''

,, ఏం చెప్పమంటావు నన్ను?''

,, నాగదేవుణ్ని ఏవిధంగా పూజిస్తే బాగుంటుందో చెప్పండి"

,,ఏ విధంగా పూజించినా బాగుండదు"

,, మీ వాదన మీదేగానీ నామాట వినరుగదా. నాగదేవుణ్ని పూజిస్తే గొల్లమల్లమ్మకు కొడుకు పుట్టాడని రాధమ్మత్త చెప్పగా వినలేదా మీరు"

,,విన్నాను'

,,వింటే సరిపోతుందా?''

' లేకపోతే ఏంచెయ్యిమంటావు నన్ను?"

" రాధమ్మత్త చెప్పినట్టు నేను పూజ చెయ్యదలచుకున్నాను మీరు కూడా నాలాగే చెయ్యండి''

,,ఏడ్చినట్టే వుంది నీ అజ్ఞానం. పామును పూజిస్తే ఓపసి వాడు వచ్చి నీగర్భములో కూర్చుంటాడా?"

,,కూర్చుంటాడో పడుకుంటాడో తర్వాత మీకే తెలుస్తుంది. ఇప్పుడు మాత్రం మీరు నాతోపాటు పూజ చెయ్యండి"

,, అది నాకిష్టం లేదు''

,,మీరు నాఇష్టాన్ని తీర్చకపోతే ఈరోజు నుండి అన్నము తినను. నీళ్ళు తాగను. చివరికి గాలి—— —"

''నీ అజ్ఞానం నాకేం నచ్చడంలేదు. చలికాలంలో తెల్లవారకముందే చన్నీటిస్నానం చేసి తడిబట్టలతో ఊరి బయటకు వెళ్ళడమంటే ఎంత కష్టం''

''కష్టపడందే పిల్లలు ఎలా పుడుతారండి మరీ?''

''బావిలో దూకితే పిల్లలు పుడుతారని ఓ భగీరతమ్మ చెప్పితే నమ్ముతావా? అగ్గిలో దూకితే పిల్లలు పుడుతారని ఓ అప్పలమ్మ చెప్పితే నమ్ముతావా?''

''నమ్మను నేనంత తెలివి తక్కువదాన్ని కాదు''

''అంటే పామును పూజిస్తే పిల్లలు పుడుతారని నమ్మేంత తెలివి తక్కువదాని వన్నమాట'' అన్నాడు వెక్కిరింతగా.

''ఇందులో నా తెలివి తక్కువతనం ఏమీలేదు. నేను చేయబోయే పూజలో మీరు పాల్గొనక తప్పదు రాధమ్మత్త చెప్పినట్టు పూజచేస్తే తప్పనిసరిగా పిల్లలు పుడుతారు. పిల్లల్ని కనకుండా బ్రతుకు సాగించలేను''

* * *

''ఎక్కడికి వెళ్లావురా?'' మారుతి ఇంటికి రాగానే అడిగింది రాధమ్మ''

''బావిలోకి''

''ఎందుకు? చావడానికా?'

''కాదు స్నానం చేసి రావడానికి,,

''పోవడానికి, రావడానికి స్నానం చేయడానికి అయితే మాత్రం ఇంత టైమ్ కావాలా?,,

''ఇంటికి తిరిగి వస్తుండగా కృష్ణమూర్తిగారింటికి వెళ్ళి

వచ్చాను.

"వాడితో నీకేం పని?"

"పనిలేదు—— ——పాము కరిచింది. ఆ విషయం నాకు తెలిసింది అందుకే ఆలస్యం ఆయినా సరేనని వెళ్ళివచ్చాను.

"ఎవరిని కరిచిందిరా?" ఆతురతగా అడిగిందామె.

"కృష్ణమూర్తిగారిని"

"ఎప్పుడు?"

"తెల్లవారకముందేనట"

"ఎక్కడ?"

"పుట్ట దగ్గర"

"పుట్టకు పూజచేయడానికి వెళ్లారా ఏమిటి?"

"నువ్వే చెప్పావటగా పుట్టకు పూజచేస్తే పిల్లలు పుడుతారని" వెటకారంగా అన్నాడు.

"అదేమిట్రా నేనేదో తప్పు చేసినట్టు మాట్లాడుతావు. నాకు తెలిసిన విషయం నేను చెప్పాను"

"మహా బాగా చెప్పావులే ఇకముందు ఎవరికీ నీ అజ్ఞానాన్ని బోధించకు, సైన్సు మాస్టారు ఏంచెప్తాడో తెలుసా....." అంటూ మొదలుపెట్టి సైన్సు మాస్టారు చెప్పిన శాస్త్రజ్ఞానాన్ని అతనికి జ్ఞాపకమున్నంత వరకు చెప్పాడు. చివరికి అన్నాడు "అమ్మా! మనం ఎవరికైనా మేలు చెయ్యాలనుకుంటే జ్ఞానం బోధించాలి. నీలాగా అజ్ఞానం బోధిస్తే జరిగేవి ఇలాంటి ఇబ్బందులే......"

రాధమ్మ మారుతి మాటలను వినడం ఇష్టం లేనిదానిలా

వంటింట్లోకి వెళ్ళిపోయింది. పదినిమిషాల తర్వాత ఆమె కాఫీ కప్పు తెచ్చి మారుతికి అందిస్తూ అంది'' కాఫీ త్రాగి చదువుకుంటూ కూర్చో నేను కృష్ణమూర్తి ఇంటికి వెళ్ళి వస్తాను.'' అని చెప్పి వెళ్ళిపోయింది.

# 14

వామనశర్మకు కరీంనగర్‌కు ట్రాన్స్‌ఫర్ అయింది. అతను వెళ్తున్నానని చెప్పగానే అంది లలిత'' నేనూ వస్తాను మీతో''

వామనశర్మ కొంచెంసేపు ఆలోచించి అన్నాడు '' మీరు నాతో వస్తానంటే నాకు అంతకంటే సంతోషం కలిగించే విషయం ఏదీ వుండదేమో. కాని ఒక విషయం ఆలోచించండి మీరు పువ్వులు ధరిస్తే దౌర్జన్యంతో వాటిని లాగేసిన మీ అమ్మ మీరు నాతో వచ్చేస్తుంటే చూస్తూ ఊర్కుంటుందా?''

'' ఇష్టాలు తీర్చుకోకుండా ప్రాణమున్న శవంలా బ్రతకాలని లేదు నాకు. ఇన్నాళ్ళ తర్వాత నన్ను అభిమానించే వ్యక్తి మీరొక్కరు దొరికారు. నాకు నచ్చిన మిమ్మల్ని అమ్మ దౌర్జన్యానికి భయపడి వదులుకోలేను''

'' మీరు నాతో వచ్చేస్తుంటే మొదట మీ అమ్మ వ్యతిరేకిస్తుంది. మనం కలసి కట్టుగా మీ అమ్మను ఎదిరిస్తే అప్పుడు మీ అమ్మ ఇరుగు పొరుగు వాళ్ళకు మన విషయం చెప్తుంది. ఆ చెప్పడంలో ఎన్ని అబద్ధాలైనా కలగలిపి మరీచెప్తుంది. ఒకరి మీద దౌర్జన్యం చేయడానికి వెనుకాడని వాళ్ళు ఎన్ని అబద్ధాలైనా ఆడుతారు ఎంత నీచానికైనా దిగజారుతారు ఇలాంటి విషయాల్లో

మీ అమ్మకు, మీ అమ్మలాంటి వాళ్ళకు సహాయం చేయడానికి చాలా మంది సిద్దంగానే వుంటారు''

" అయితే నన్నేం చెయ్యమంటారో చెప్పండి''

''నేను కరీంనగర్ వెళ్ళగానే స్కూల్ అడ్రసుకు మారుతికి ఉత్తరం రాస్తాను నేను రాసిన అడ్రసుకు వస్తే అక్కడే మనం పెళ్ళి చేసుకోవచ్చు ఇదీ నా అభిప్రాయం. మీ అభిప్రాయం ఏమిటో చెప్పండి''

' మీరు చెప్పింది బాగానే వుంది.'' అని కొంచెం సేపు మౌనం వహించిన ఆమె ప్రేమ నిండిన కంఠస్వరంతో మెల్లగా అంది " ఉత్తరం రాయడంలో మాత్రం ఆలస్యం చేయకండి"

వామనశర్మ కరీంనగర్ వెళ్ళిపోయాడు. నాలుగు రోజుల తర్వాత అతడు రాసిన ఉత్తరం వచ్చింది. ఇంట్లో తల్లి లేనప్పుడు చూచి మారుతి లలితకా ఉత్తరం ఇచ్చాడు.

మరునాడు తెల్లవారకముందే లేచిన రాధమ్మ ముఖం కడుక్కొని స్నానంచేసి ఇడ్లీలు చేయడానికి వంటింట్లోకి వెళ్ళింది.

అరగంటలో ఇడ్లీలు చేసేసి మారుతి పడుకునే గదిలోకి వచ్చి అతనిని తట్టి లేపుతూ మెల్లగా అంది "ఒరేయి ఇడ్లీలు చేశాను. లేచి ముఖం కడుక్కొనిరా ఆలస్యం అయితే చల్లారి పోతాయి.''

మారుతి లేస్తూనే అడిగాడు ''అక్కయ్య లేచిందా?''

''గది తలుపులు మూసేవున్నాయి. ఇంకా లేచినట్టు లేదు. అదిలేచేలోగా నువ్వు ఇడ్లీలు తినేసెయ్యి"

ఏరోజు ఏటిఫిన్ చేసినా లలితకు కనిపించకుండా జాగ్రత్త

పడుతూ మారుతికిపెట్టి తను తినేస్తుంది.

మారుతి ఇడ్లీలు తిని బజారుకు వెళ్ళి తల్లి చెప్పిన కూర గాయలు కొని తెచ్చాడు "అక్కయ్య లేచిందా?" అని మళ్ళీ అడిగాడు.

"ఈరోజు ఎందుకోగానీ ఇంత పొద్దెక్కినా ఆ గది వదలి రావడంలేదు" అంటూనే అటువైపు వెళ్ళి లలిత పడుకునే గది తలుపులు తెరచింది.

మంచముపై లలిత కనిపించలేదు. కాగిదం కనిపించింది.

"ఇది ఎప్పుడు లేచినట్టు? ఎక్కడికి వెళ్లినట్టు? ఈ కాగిద మేమిటో చూడరా బాబూ" అంటూ ఆ కాగిదం తీసి మారుతి కిచ్చింది

మారుతి చదివాడు. అందులో ఇలా వుంది.

అమ్మా! వెళ్లిపోతున్నాను

"లలిత"

రాధమ్మ ఏడ్వడం ప్రారంభించింది. ఇరుగు పొరుగు వాళ్ళు వచ్చి లలితను విమర్శించారు. రాధమ్మను ఊరడించారు. మారుతి ఏమీ తెలియనట్టే వుండిపోయాడు.

రాధమ్మ భర్తకు టెలిగ్రాం ఇచ్చింది. అతడు వచ్చాడు. లలితకోసం చుట్టు పక్కల గ్రామాలలో వెదికాడు. లలిత దొరక నందున నిరాశచెంది తిరిగి చాందా వెళ్ళిపోయాడు.

# 15

రాధమ్మ వరండాలో కూర్చుండి ప్లాస్టిక్ బుట్ట అల్లుతూవుంది

మారుతి బావి దగ్గర కూర్చుండి మట్టితో ఏనుగు బొమ్మను తయారు చేస్తున్నాడు

ఆ సమయములో గణపతి వచ్చాడు. అతడు రాధమ్మ తమ్ముడు లీల తండ్రి.

ఇక్కడ లీల ప్రేమకథ తెలుసుకోవాలి.

కొన్నాళ్ళ క్రితం లీల సురేశ్ అనే యువకునితో తిరగడం చూశాడు గణపతి "మగవాళ్ళతో తిరగకూడదు" అన్నాడతడు.

"నేను అతనిని ప్రేమించాను"

"అతడు తక్కువ కులంవాడు. పెళ్లి చేసుకోవడానికి వీలుండదు సంఘం ఒప్పుకోదు"

"అలాంటి సంఘంతో నాకేం సంబంధంలేదు" అని ధైర్యంగా చెప్పేసిందామె కాని ఆధైర్యం ఎన్నాళ్ళో నిలువలేదు. సురేశ్ అధిక వరకట్నానికి ఆశపడి మరో స్త్రీని వివాహమాడాడు. కాని ఇంతలో లీలకు నెల తప్పింది. లీల పెళ్లికి గణపతి తొందర పడ్డాడు మోసగాడైనా సురేశ్‌ను అసహ్యించుకొని తండ్రి ఇష్టానుసారంగా పెళ్ళిచేసుకోవాలనుకుంది లీల. గణపతి రెండు మూడు సంబంధాలు చూశాడు. వాళ్ళు కోరిన కట్నం ఇవ్వలేక వదులుకున్నాడు. ఆలస్యం అయితే లీల గర్భం బయట పడుతుందన్న భయపడి లీలను మారుతికివ్వడం ఇష్టంలేకపోయినా ఇవ్వడానికేవచ్చాడు.

రాధమ్మ గణపతి మాట్లాడుతుండగా మారుతి మట్టితో తయారుచేసిన ఏనుగు బొమ్మను పట్టుకొని వరండాలోకి వచ్చాడు. ఆ ఏనుగు బొమ్మకు కొమ్ములున్నాయి దానిని చూడగానే గణపతికి నవ్వువచ్చింది, కాని నవ్వలేదు.

రాధమ్మ మారుతి దగ్గరనుండి ఏనుగు బొమ్మను తీసుకొని

కొమ్ములు తీసేసి మారుతికి తిరిగి ఇచ్చేసింది.

"కొమ్ములెందుకు తీసేశావే?" అన్నాడు మారుతి ప్రశ్నార్థకంగా ముఖం పెట్టి.

"ఏనుగుకు కొమ్ములుండవు" అంది రాధమ్మ.

"ఏనుగుకు కొమ్ములుండవని నాకు తెలియదనుకున్నావా?"

"తెలిసినప్పుడు కొమ్ములెందుకు పెట్టావు మరి?"

"నువ్వు అదేదో పండుగకు మనిషి బొమ్మకు ఏనుగు తలకాయ పెట్టి పూజలు చేస్తావుగా! మరి మనిషికి ఏనుగు తలకాయ వుండదని నీకు తెలియదా?" అంటూ ఎదురు ప్రశ్న వేశాడు.

గణపతి ఆ ప్రశ్న విని ఆశ్చర్యపోయాడు.

"అది వినాయకుని బొమ్మరా బాబూ! అతనికి నిజంగానే ఏనుగు తలకాయ వుంటుందట"

"ఎవరన్నారు?"

"ఎవరన్నారో ఏమో కానీ తెలివికలవాళ్ళంతా దానిని అంగీకరించడంలేదా?"

"వాళ్ళు కూడా నాలాగే తెలివి తక్కువవాళ్ళనే అమ్మా! నేను నా తెలివితక్కువతనాన్ని ఒప్పుకుంటాను. వాళ్ళు ఒప్పుకోరు. అంతే తేడా" అని చెప్పి వీధిలోకి వెళ్ళిపోయాడు.

గణపతి పెళ్ళి ప్రస్తావన తెచ్చాడు. తను ఇవ్వదలచుకున్న వరకట్నం ఎంతో చెప్పాడు.

"వరకట్నం మరో వెయ్యి ఎక్కువచేసి, రెండు తులాల బంగారం, రెండు వెండి గిన్నెలు మాత్రం పెట్టు" అంది రాధమ్మ.

గణపతి ఒప్పుకున్నాడు.

రాధమ్మ చివరి కోరిక అన్నట్టు అడిగింది "వాడిదో చిన్న

కోరికరా తమ్ముడూ! వాడికి రేడియో కావాలట"

"రేడియోదేముందక్కా! నువ్వు అడగడం నేను కాదనడ మూనా అలాగే కానీ" అన్నాడు.

అదే వారంలో మంచి ముహూర్తం వుండడంతో పెళ్ళి కూడా చేసేశారు.

# 16

రేడియోలో వస్తున్న పాట వింటూ నవ్వుతూ వుంది లీల.

"నువ్వు రేడియో అమ్మాయిలాగే నవ్వుతావు లీలా!" అన్నాడు మారుతి.

లీల రేడియో ఆపుచేసి "నువ్వు రేడియో అబ్బాయిలా పాట పాడు బావా?" అంది.

"నేనా?"

"అవును నువ్వే. ఏం నీకు పాటరాదా?"

మారుతి గబగబా వెళ్ళి గూట్లోవున్న సినిమా పాటల పుస్తకాన్ని తెచ్చి చదవసాగాడు. కంఠం కాస్త బాగానే వుంది. కాని నత్తి పైగా భాషను ఖూనీ చేస్తున్నాడు లీల అప్పుడప్పుడు సరి చేసి చెప్పాలనుకుంది. కాని అతడు పాడే విధానం నవ్వుపుట్టించే విధంగా వుండడంతో నవ్వడంలో మునిగిపోయింది

అతడు పాట పాడడం పూర్తిచేశాక "నువ్వు కూడా ఓపాట పాడవూ?" అన్నాడు.

ఆమె ఓ పాటపాడి విన్పించింది. మారుతి ఆమె ఉచ్చారణను మెచ్చుకున్నాడు. "నువ్వు చాలా తెలివికలదానవు లీలా. నేను నీకు తగినవాడను కానేమో. నువ్వు నన్ను ఇష్టపడే పెళ్ళి చేసుకున్నావా? లేక మీనాన్న బలవంతం చేశాడా?"

లీల గడుసుగా నవ్వి అంది "నీసంగతి చెప్పు నువ్వు నన్ను ఇష్టపడే చేసుకున్నావా?''

''నువ్వు నా భార్యవుకావడం నా అదృష్టంగా భావిస్తున్నాను''

''నువ్వు అలా భావించినప్పుడు నిన్ను నేను అభిమానించకుండా వుండగలనా?'' అంది.

"నాకు...నాకు లెక్కలు చెప్తావా?'' అన్నాడతడు.

చెప్తానన్నట్టు తలవూపింది లీల. అతడు పుస్తకము, నోటు బుక్కు పట్టుకొని వచ్చాడు. ఆమె అతడడిగిన లెక్కలు చెప్తూ ''పందొమ్మిదయిదు లెంత?'' అని అడిగింది.

"ఎనభై నాలుగు'' అన్నాడతడు తడబడకుండా.

లీల కిసుక్కున నవ్వబోయి నవ్వాపుకొని ''తొంభై అయిదు'' అని చెప్పి లెక్క చేసి చూపించింది.

''లీలా! నువ్వు చాలా తెలివికలదానవు. ఇంకా ఏమైనా చెప్పు వింటాను''

''కొన్ని ప్రశ్నలు అడుగుతాను. సమాధానాలు చెప్తావా?'' అందామె.

''అడుగు చెప్పగలిగితే చెప్తాను''

''హుమాయూన్ కొడుకు ఎవరు?"

''పిచ్చి తుగ్లక్''

లీల నవ్వింది.

''కాదా?'' అన్నాడు మారుతి. కాదన్నట్టు తలత్రిప్పింది లీల.

''మరెవరు?''

'' అక్బర్ ''

లీల మరో ప్రశ్న అడిగింది ''ఉత్తరప్రదేశ్ రాజధాని యేది?''

మారుతి కొంచెం ఆలోచించి "లాక్ అనుకుంటాను" అన్నాడు.

"లాక్ కాదోయ్ బావా —లక్నో"

"అచ్చు యంత్రము కనిపెట్టిన దెవరు?"

"అచ్చుయంత్రం అంటే——"

"అంటే.. మనం చదువుకునే పుస్తకాలను అచ్చువేసే యంత్రమన్న మాట"

"ఓహో అదా—ఎవరు కనిపెట్టారు దాన్ని?"

"గూటెన్ బర్గ్"

"వేయిపడగలు నవలను ఎవరు వ్రాశారు?"

"వేయి పడగలా——అమ్మో——ఒకటికాదు, రెండు కాదు వేయి పడగలే! వేయి పడగలు—పడగలు—పడవను పచ్చి పులుసు పుల్లయ్య వ్రాసి వుంటాడు"

లీల నవ్వుతూ అంది "కాదు......కాదు. విశ్వనాథగారు వ్రాశారు"

"ఆమె ఎవరు?"

"ఆమె కాదండి. విశ్వనాథ సత్యనారాయణగారు పురుషులే కవి సామ్రాట్టు విశ్వనాథ సత్యనారాయణ గారు మీకు తెలియదా? వేయిపడగలు వ్రాసింది ఆయనే"

"పేకమేడలు వ్రాసింది ఆయనేనా?"

"అబ్బా" తలపట్టుకుందామె "ఇంత చిన్న విషయాలు తెలియకపోతే ఎలా బావా? తెలివి తక్కువవాళ్ళను ఎవరూ గౌరవించరు. నువ్వు తెలివి సంపాదించుకోవాలి"

అలాగే అన్నట్టు తలవూపాడు మారుతి.

లీల కుర్చీమీది నుండి లేచివచ్చి మంచంమీద పడుకొని మారుతి వైపు చూస్తూ అంది ,,బావా! కుంతీదేవికి ఎంతమంది కొడుకులో చెప్పగలవా?''

,,ఏ కుంతీదేవికి?'' అన్నాడు మారుతి ప్రశ్నార్థకంగా ముఖంపెట్టి.

,,భారతంలోని పాండురాజు భార్యఅయిన కుంతీదేవికి''

"నాకు సరిగా జ్ఞప్తికి లేదు లీలా!——ముగ్గురు కావచ్చు కాదు...నలుగురు అయివుంటారు"

"వాళ్ళు పాండురాజుకు ఏమవుతారు?''

"కొడుకులవుతారు?''

,,నాకు కొడుకు పుడుతాడనుకో వాడు నీకు ఏమవుతాడు?''

"నేను తెలివితక్కువవాడనని నామీద మరీ అంత తెలివి తక్కువ ప్రశ్నలు వేయకు లీలా!'' అన్నాడతడు

లీల మారుతి ముఖంలోకి చూస్తూ మౌనంగా వుండిపోయింది.

మారుతి లైటు తీసేసి వచ్చి లీల ప్రక్కన పడుకున్నాడు.

# 17

ఆరోజు నుండి రాధమ్మ లలితను తలచుకొని ఏడ్వనిరోజు లేదు.

,,ఎందుకమ్మా ఏడుస్తావు. భర్తను పోగొట్టుకొని అక్కయ్య ఈ ఇంటికి వచ్చాక దానికి కడుపునిండా తిండైనా పెట్టావా

ఏరోజైనా?" అన్నాడు మారుతి ఓసారి కోపంగా.

"దానిమీద ఎంత ప్రేమవున్నా విధవ అయ్యాక నిజంగానే దానికి కడుపునిండా తిండి పెట్టలేక పోయాను" అంటూ మళ్ళీ ఏడ్చింది.

"మాటమాటకు ఏడుస్తావెందుకే? నిజమైనా ప్రేమవున్న వాళ్ళు చచ్చినా ఏడ్వరు. అన్నాడు మారుతి ఒళ్ళుమండి.

రాధమ్మ మాట్లాడలేదు.

"ఇష్టాలు తీర్చుకోలేక కషాలు భరించలేక అక్కయ్య చచ్చిపోతుందనుకో. అది నీకు ఇష్టమేనా?" అంటూ ఓ ప్రశ్న వేశాడు. మారుతి.

"కూతురు చచ్చిపోవడం ఏతల్లికి ఇష్టం అవుతుందిరా?" అంటూ ఎదురు ప్రశ్న వేసిందామె ఏడుస్తూనే.

"అయితే అక్కయ్య మళ్ళీపెళ్ళి చేసుకొని ఈ ఇంటికి వస్తానంటే నువ్వు అంగీకరిస్తావా అమ్మా?" అని మారుతి ఇంకో పశ్నవేశాడు.

"ఇంకా అంగీకరించక ఏంచేస్తాను? అయినా అది ఉందో చచ్చి పోయిందో" అంది కన్నీళ్ళు తుడుచుకుంటూ

మారుతి గబగబా గదిలోకి వెళ్ళి తలుపులు మూసేసి లలితకు ఉత్తరం రాశాడు.

అయిదు రోజుల తర్వాత లలిత దగ్గరనుండి రాధమ్మ పేరుతో ఉత్తరం వచ్చింది.

రాధమ్మ ఆ ఉత్తరాన్ని మారుతికిచ్చి చదువుమంది.

"అమ్మకు నమస్కరించి వ్రాయునది. తమ్మునికి ఆశీస్సులు





తెలుపగలవు. మీకు చెప్పకుండా రహస్యంగా ఇక్కడకు వచ్చి నందుకు నాకూ బాధగానేవుంది. కాని అలా చేయక తప్పలేద నేను, వామనశర్మగారు పెళ్ళి చేసుకున్నామని తెలియచేయడాని సంతోషిస్తున్నాను. మీరు మాపెళ్లిని ఆమోదిస్తే.........మీర మా క్షేమాన్ని కాంక్షిస్తే...మీకు మమ్మల్ని చూడాలని వుంటే క్రింద ఇచ్చిన అడ్రసుకు రాగలరు. నాన్నకు చాందాకు ఉత్తర రాస్తున్నాను" లలిత,

లలిత క్షేమంగా వున్నందుకు రాధమ్మ సంతోషించింది. మారుతి ఆనందానికి అంతులేదు

"మేము ఆదివారంనాడు కరీంనగర్‌కు వస్తున్నాము. బస్టాండులో కలుసుకో" అని లలితకు టెలిగ్రాం ఇచ్చింది రాధమ్మ

---



ప్రేమకు పెళ్ళెప్పుడు? మొదటిసారి
"కథాంజలి" మాసపత్రికలో
జులై 1980 సంచిక నుండి
నవంబర్ 1980 సంచిక
వరకు సీరియల్‌గా
వచ్చింది.